శ్రీ కనకదుర్గాంబాయై నమః.

జీవ-బ్రహ్మైక్య రాజయోగ సారామృత గ్రంథమును,

# మంజరీ ద్విపద,





బ్రహ్మశ్రీ, ప్రతాప - వెంకటేశ్వరకవిగారిచే

రచియింపఁబడి,

శ్రీ సచ్చిదానంద[illegible]ం పనివారిచే,



చెన్నపురి చూళై

శ్రీ భారతి ముద్రాయంత్రమున ముద్రించి

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు: 4,000.

20-4-1928.

[దీని వెల, 4-అణాలు.

వి. పి. ఖర్చులు ప్రత్యేకము.

# ఈ గ్రంథకర్త రచియించిన గ్రంథములు.

1. "జీవ బ్రహ్మైక్య రాజయోగ సారామృతము" ఆంధ్ర భాష మొదటినుండి చివరవఱకు 1246-పుటలును, 48-పటములును గలది కాలికోబయిండు - - రూ. అ. 4—4
2. "జీవ బ్రహ్మైక్య వేదాంతరహస్యము" ద్రావిడభాష- 4—0
3. డిటో ఇంగ్లీషు మొదటిభాగము - - - - 2—8
4. శ్రీ కృష్ణార్జున సంవాదరూపముగా వ్రాయఁబడిన శ్రీ భగవద్గీత ద్రావిడభాష నాలుగవకూర్పు - - 2—4
5. శ్రీ కబీర్ దాస్ చరిత్రము ద్రావిడభాష మూడవకూర్పు 2—4
6. మనోవేగము నిలిపిచూపుట ఇంగ్లీషు - - 0—4
7. పై ఆంధ్రగ్రంథమును మంజరీ ద్విపదగా, ప్రతాప వెంకటేశ్వర కవిగారిచే ఆంధ్రభాషలో వ్రాయఁబడినది. 100 పుటలును, రెండు పటములును గలది - 0—4
8. పూజఅరకు కావలసిన మంచి సువాసనగల అగరుబత్తీలు. ఇవి మూలిక దినుసులతో చేయఁబడి $1\frac{1}{4}$ గంటసేపు వెలుగునది వంద (100-కి) - - - - - 2—0
9. ఈ గ్రంథకర్త మూడు నెలలు పదమూడు దినములవఱకు యోగసమాధియందుండి వెలువడినవెంటనే పూజకు గాను తీయించిన 12×10-అంగుళములపొడుగు, వెడల్పుగల గొప్పపటము. ఇది వి. పి. లో పంపుటలేదు. ముందుడబ్బు రూ. 1-0-0 పంపువారలకు మాత్రమే రిజిష్టరుద్వారా ఫోటో పంపఁబడును. వీరలకు మరి వేరు పోష్టుఖర్చులు లేవు - - - - 1—0

వలయువారు క్రింది చిరునామాకు వ్రాసికొనవలయును:—

☞ శ్రీ సచ్చిదానందర్ కంపెని,

పెరంబూరు బారక్సు, చెన్నపురి.

# పీఠిక.

కడపజిల్లా గడికోట ఆశ్రమవాసులగు శ్రీ పరమహంస సచ్చిదానంద యోగీశ్వరులవారిచే, "జీవబ్రహ్మైక్య వేదాంతరహస్య" మనెడు యొక అపూర్వమైన గ్రంథము ద్రావిడభాషలో తొమ్మిదికూర్పులవఱకు అచ్చొత్తింపబడి యిరువదిమూడువేల ప్రతులు విక్రయింపబడియున్నవి. ఇది అపూర్వమైనగ్రంథము కానిచో యిన్నికూర్పులు ముద్రితమైయుండజాలవు. ద్రావిడదేశమునందుండు ఒక్కొక్క చిన్నగ్రామమునందును యీ ద్రావిడగ్రంథము వ్యాపించి విశేష ప్రసిద్ధికెక్కియున్నది. అట్టి యుత్కృష్టమైన గ్రంథము యిప్పుడు, "జీవ బ్రహ్మైక్య రాజయోగ సారామృత" మను నామముతో ఆంధ్రమున రెండవకూర్పుగా, ముద్రితమైయున్నది. ఈ గ్రంథములో, మనోలయముచేయు విషయమునుగురించి విశేషముగా బోధింపఁబడియున్నది. మనస్సుయొక్క రూపము వాయువాంశమని జెప్పి ఈ మనస్సునకు కెరటములలో (అలలలో) బుట్టు చిన్నచిన్న బుగ్గలు, తుంపరలు, బుడగలు మొదలగువాటిని దృష్టాంతముగా జూపెట్టి, మనోవేగమును నిలుప ననేక ఉపదేశములను ఉపదేశించియుండుటయేగాక, బాలురు బాలికలుసహా అతిసులభముగా ప్రాణాయామాభ్యాస సాధనచేయునటుల మిక్కిలి సులభశైలిగాను, తేటతెలుగుగా నీ గ్రంథమును వ్రాసియున్నారు. ఇట్టి అపూర్వమైన గ్రంథము యిదివరలో నెవరును జూచియుండజాలరు. ఇంతియెగాక, ఈగ్రంథకర్త పూర్వజన్మమునందు క్రైస్తవ శరీర మెత్తి ఉపదేశిగాయుండినదానిని తన యోగదృష్టిలో దెలిసికొనిరి. దానిని "జీవ బ్రహ్మైక్య రాజయోగ సారామృత" గ్రంథమునందు విపులముగా వ్రాసియున్నారు.

ఇంతియెగాక, పైయోగీశ్వరులవారు 3-నెలలు, 13-దినముల వరకును యోగసమాధిలో యుండినపుడు నచట తా ననుభవించిన విష

యములంతయు రెండవకూర్పు "జీవ బ్రహ్మైక్య రాజయోగ సారామృత" గ్రంథములో విపులముగా దెలిపియున్నారు. ఈ గ్రంథము యొక్క సారాంశములనెల్లను యీపీఠికలో వ్రాయుట కలవికాదు. కనుక, "జీవ బ్రహ్మైక్యములోనున్న కొన్ని అంశములను మాత్రమే మంజరీద్విపదగా వ్రాసి వెల్లడిచేయుచున్నాను. ఇట్టి గ్రంథమును ప్రతి స్త్రీయును, పురుషుడును అత్యావశ్యకముగా జూచి దానియం దుపదేశించియున్న ఉపదేశములను చదివి అందు చెప్పియున్నప్రకారమే సాధనముచేయుచు వచ్చినచో అట్టివారలకు మోక్షమనెడి గొప్ప సామ్రాజ్యపదవి తప్పక లభించుట క్వావంతయు సందేహములేదు. ఈ గ్రంథమునకు దృష్టాంతముగా జూపెట్ట అద్వైతరూపమున ద్రవిడ భాషలో ఆరు అధ్యాయములవఱకు, శ్రీ కృష్ణార్జున సంవాదరూపముగా వ్రాయఁబడిన శ్రీ భగవద్గీత నాలుగవ కూర్పువఱకు విక్రయింపబడియున్నది. ఈ భగవద్గీత "శీఘ్రకాలములోనే ఆంధ్రభాషలో వెలువడబోవుచున్నది." "ఈ గీతయొక్క సారాంశమును" "జీవబ్రహ్మైక్య రాజయోగ సారామృత" గ్రంథములో నచ్చటచ్చట దృష్టాంతముగా చూపెట్టియున్నారు. ఇదివరలో ననేకులు వ్రాసియున్న గీతలకంతయు యిది మిక్కిలి శ్రేష్ఠముగానుండును. గనుక, ఈ గీతనుకూడా ప్రతివారును అత్యావశ్యకముగా చూడవలసినదేను సుమా!

ఇట్లు విన్నవించు
బుధజన విధేయుడు,
ప్రతాప వేంకటేశ్వర కవి,
వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.



# విషయసూచిక.

పుట





# గ్రంథకర్త యోగసమాధి అనుభవము.

ఇదిగో! ☞ యెదుటనున్న యీచాయపటము
సదయులౌ యోగీంద్ర సచ్చిదానందు
లరువదిమూడవ యబ్దమ్మువయసు
వరలుచుండెడివేళ వరయోగశక్తి
పోడిమిమైగాంచ బుద్ధిదలంచి
మూడునెలల పదమూడుదినముల
వరకన్నపానముల్ వర్జించియోగ
పరతంత్రులై రేయి పగలునుకూడ
నిష్ఠయందుండంగ నిజరూపుమార
శ్రేష్ఠమైయొప్పు శారీరబలమ్ము
ఘనముగశుష్కించి గడ్డమ్ముపెరిగి
మునుపున్నరూపమ్ము పూర్తిగామారి
యున్నట్టితరి తీసి యుండగాఁబడియె;
క్రిష్ణనవీరు-యోగ సమాధియందు
నెటులకూర్చుండెనో నేమేమిగనెనో
పటుతరానందమ్ము బడసిన దెటులో
బాగుగ(శ్రీ)జీవ బ్రహ్మైక్యరాజ
యోగసారమ్ములో నొప్పుగాకూర్చి
రెండవకూర్పు ముద్రించె; నందునను
నుండురహస్యమ్ము లొక్కప్పుడేని
కనివినియెఱుగని కారణమ్మునను
జనులెల్లతా మవశ్యమ్ముగాజదివి
జీవబ్రహ్మైక్య విశేషముల్ దెలియ
గావచ్చు మోక్షమ్ము గాంచగావచ్చు.




శ్రీ కనకదుర్గాంబాయైనమః.

# జీవబ్రహ్మైక్యసార
# మంజరీ ద్విపద.

## శ్రీ పరమహంస సచ్చిదానంద యోగీశ్వ రులవారి ఛాయాపట విషయము.



(సింహేంద్ర మధ్యరాగ లేక, దేవగాంధారి-చాపుతాళము)

ఇచ్చోటఁగలయట్టి యీ చాయపటము
సచ్చరిత్రుం డైన సచ్చిదానంద
యోగీశ్వరుం డర్వ దొక్కటి యేట
యోగసాధన వీడి యున్నట్టి వేళ
తీయించిరిప్పు డీ తీరుగనుంట
కీయెడ వివరింతు హేతువుఁ గనుడు
మూడుసంవత్సరములు దేశమెల్ల

పీడక చరియించు వేళల యందు
ఆయా స్థలముల యోగాభ్యాస మెలమి
జేయ సౌకర్యంబు సిద్ధింపకుంట
యోగసాధన జేయు టొక్కింతమాన
బాగైన యారోగ్య పదవి నశించి
తనువు స్థూలంబాయె దనరె; కేశములు
కనుపించె నరసిన గతి తెల్లగాను;
అలయోగి రోమమ్ము లావంత యేని
తెలుపెక్క వంచును తేల్పు శాస్త్రమ్ము
కాన వీరంతట కాల్యకృత్యముల
కైన బయటరాక గదియందె యుండ
స్నానపానమ్ముల సౌకర్యమునకు
మాననీయంబైన మందిరమందు
గదిన్రొయొండు గైకొని కడక మూణ్ణెలలు
పదుమూడు దినములు వసియింపఁజాలి
నడిరేయిని విసర్జనమ్ముల కేగి
వడి తానమాడియు వచ్చి కూర్చొనియు
జలమాత్రమున ప్రాణసంరక్షణమ్ము
సలుపుచు యోగంబు సాధన జేయ
నరసిన రోమముల్ నల్లరంగుకును
వరుసగా మారెను బహువింతగాను
యీ మెయి వెంట్రుక లిట్టులౌటకును
స్వామివారలు తన స్వానుభవంబు
తేటతెల్లముగాగ దెల్పిన విధము

పాటించి వివరింతు బహుశ్రద్ధ వినుడు
పరమగోప్యంబౌచు భద్రమ్ము లౌనగ
వరలు ప్రాణాయామ పద్ధతినెల్ల
యీ పొత్తమందున నెట్టులుండెడినో
ఆ పథమ్మునె తాము యాచరించిరిగ
పరిశుద్ధమైనట్టి బయలు వాయువును
తరచుగా నాసికా ద్వారమ్ము వలన
శ్వాసగాపీల్చుట సహజమ్మె యట్టి
శ్వాసగాబీల్చిన వాయువునెల్ల
కడుపులో కుంభించి కాసంతసేపుని
విడువంగరాదుగా వెలుపలి, కటుల
సమల క్రొలందిగా సాధనజేయ
క్రమముగా కుంభించుగాలియు కాలి
బొటన వ్రేలాదిగా పూర్ణమైయొప్పు
పటుతర తనువున బ్రహ్మకపాల
పర్యంతమును ప్రాకి, భయమూని యుండి
చౌర్యంబొనర్చిన జనుని విధమ్ము
వడి మూడుకోట్ల యేబది లక్షలగుచు
నడరు రోమమ్ముల కైన ద్వారముల
పరుగులెత్తుకవచ్చి బయటకుజేరు
సరగుననావచ్చు సమయమ్మునందు
రైలుపోయెడివేళ ప్రక్కల నున్న
శాలలు మిద్దెలు సౌధమ్ములెల్ల
అదరుచుండెడిరీతి ఆ వాయువునకు

కదలియు దేహంబు కంపంబు నొందు
ఆవేళ తనువున కధికశ్రమ యగు
ఆవేదనసహించ నౌను ఓర్పునను
అటులోర్చుకొనియుండ నా వాయు వెలమి
పటుతర రోమకూపమ్ముల యందు
చరియించు నరయు కేశమ్ములనెల్ల
వరుస నల్లనికాంతి బడయంగ జేయు
కాన వృద్ధులుకూడ ఘన యౌవనులుగ
కానుపింతురుగాదె కడు నబ్బురముగ
దీనిని మనస్వామి తేటతెల్లముగ
స్వానుభవమ్మున బాగుగ గాంచి
జనులకు నీ రహస్యంబు చాటంగ
మనమున దలపోసి మరితాను వ్రాసె
కాని శాస్త్రములెల్ల గాలించి వెదుక
కానుపింపదు సుండి కొంసంతయేని;
పై రీతి నాత్మీయ పలిత కేశములు
వారక నల్లని వన్నెకు రాగ
తనరూపుమారంగ తన చాయపటము
కనుపింపజేసెను గాంచుడి తొలిని
ద్రవిడయోగీంద్రులు ద్రవిడగ్రంథముల
కవనమ్ముగావ్రాయ గల్గిరేమనిన
"నిలను ప్రాణాయామ మెట్టి ముదుసలియు
సలిపినచో జరక్ సమయంగ జేసి
బాలురవలె రూపు బడయుదు"రనుచు

ఆలీల లిఖితమగా నాపల్కులెల్ల
సూనృత మే యంచుచూపెట్టుటకును
మానసంబున నెంచి పాతికవంతు
తనరోమములకున్న ధావళ్య ముడిగి
ఘనమైన నల్లనికాంతితో మెఱయ
యీచాయపటము దా నిట్టులందరికి
గోచరింపగ జేసె గోర్కెతో గనుడి
యీరీతి మహిమమ్ము లీ జగమ్మునను
ధీరత జూపుట తెలియమెన్నడును
అడుగుపాడవు గల్గి యంగుళాల్పదియు
వెడలుపు నొప్పంగ వెలయుమేల్పటము
పూజింపగా నెంచు పుణ్యమూర్తులకు
రాజితంపు ఫొటోను క్రియమ్ముకిచ్చెదరు.



## శ్రీ సచ్చిదానంద యోగీశ్వరుల వారు యోగసమాధియందుండిన స్వానుభవములను వెలుపరచుట.



మనయోగి యోగసమాధియందుండ
గను చిన్నగది నొందు గైకొనెననుచు
ఇంతకుమున్ను లిఖించితిగాదె

అంతట వారల స్వానుభవంబు
యీరీతి ప్రకటించి రింపుతో గనుడి
వీర లాగదిలో ప్రవేశించుటాది
రేయివేళను తాను రెండుగంటలకె
బాయక స్నానంబు ప్రతిరోజుచేసి
అల్ల ప్రాణాయామమాది యోగములు
నుల్లంబు రంజిల్ల నొనరించుచుండ
యోగసాధన జేయ నుంకించు వేళ
బాగుగ నొకనిమ్మపండంత వెన్న
ఆరగించుచునుండు నదియేల ననిన
వారక యోగమ్ము వలన జనించు
యోగాగ్నితీవ్రత్వ ముపశాంతి జేసి
బాగుగా నారోగ్య భాగ్యదంబనుచు
ఆరీతి వెన్న దా నారగించియును
క్షీరమ్ము నిశియందు చిక్కని కతన
తా సాధనమొనర్ప తత్పరుండగుచు
శ్వాస నాఘ్రాణించు సమయమ్మునందు
మూడుగుక్కల నీరమును గ్రోలుచుండు
వాడుకయుం గద్దు వాస్తవమ్ముగను
అంతట యుదయమ్ము నారుగంటలకు
సంతసమ్మున నిత్య సాధనమ్మునకు
గుక్కలు మూడింటి గ్రోలు క్షీరమ్ము;
ఒక్కొక్క నాసిక నూపిరిపీల్చి
పిమ్మట వాయువు ప్రేగు క్రిందగను

నిర్మళంబుగలోన నిల్పంగ జాలి
ఆ వాయు వొక్కింత నైన వెల్పలికి
బోవంగనీయక మునుకొని తాను
ఎంత లెక్కింపంగ నెంచియుండెడినో
అంతదనుక ను శ్వాస మట్టులే నిల్పి
లెక్కించి శ్వాసను రేచించునపుడు
చక్కగా నాత్మీయ శ్వాసను నాలు
గంగుళాల్ రేచించి యటుబీల్చి నాలు
గంగుళమ్ములవీడి యట్టులేసరిగ
రేచించి శ్వాస పూరించుచు నిట్టు
లాచరించుచు నిష్ఠ నందంగ వలయు
పేర్వునిండగ గాలి బీల్చికుంభించ
నావంత క్షుద్బాధ నందగాజోరు
ఢీయుతు లిద్దాని తేటతెల్లముగ
వాయు భక్షణయంచు పల్కుచుందురుగ
మనయోగి చంద్రు డీమాదిరిగాను
అనుదినమ్మును క్షీర మారగించుచును
గాలిని గ్రోలి యోగమ్మునువీడి
లీలగా పగలు పండ్రెండుగంటలకు
యాపిల్ఫలంబులో నర్ధభాగమ్ము
నాపడి తక్కిన సగము రాతిరిని
ఆరగించుచునే యోగ మందు తా గన్న
సారమ్ము వివరించె శ్రద్ధతో గనుడి
వాసు పద్మాసనవ్యావృతినుండి

వారక యోగ మభ్యాసమ్ము జేసి
యూరకే కూర్చుండి యుండన వేళ
వారలమనము యేవస్తువుపైన
జేరక, వాయువుచే కొట్టబడక
స్ఫారవిద్యుత్కాంతి సమమైనప్రభను
స్థిరత ప్రకాశించే దీపమ్మువలెను
స్థిరముగా నుండి విశేషమైన
యానందముగనుండు నట్టియానందమ్ము
యానె వాకుర్వ్వంగ నానెవారియంగ
ఇట్టిసౌఖ్యమ్మును నిందారిదులైన
యెట్టివేళలను వహించగా గలరె
కారణంబేమన్న కామ్యంబుకోరి
వారు యజ్ఞానుల్లు వందలుజేసి
ఆపుణ్యమహిమను నా దేవలోక
మాపదమ్మునుజెంది రక్షించునంట
సూచికాగ్రింబంత సుఖమైనగాని
నోచేరువారంచు నుడువంగవచ్చు
ఆ పుణ్యముండెడి నంతమాత్రమ్మె
ఆపదంబులనుంచు రావల మరల
పుణ్యంబుక్షీణించి పోవగా భువిని
గన్యుడో యోగిగాగను జనియించి
ఆ సుఖమ్మును గాంతురంచు స్పష్టముగ
యేసందియము లేకనే చెప్పవచ్చు
ఉపవాసములతోడ నుండి సుక్కినను

జపములు తపములు చాలచేసినను
యీవిధసౌఖ్యమ్ము నించుకేనియును
యేవారలందరు దృఢముగా ననుచు
మన యోగివర్యులు మనకు బోధించె
మనసు సుస్థిరమైన మార్గమందుంచ
యోగసాధన జేయు టొక్కటే యనుచు
బాగుగ వారలు వాకుృచ్చుచుండె
ఐకకంఠ్యముగాగ నలయోగమహిమ
శ్రీకృష్ణపరమాత్మ జెప్పెను గీత
ఇంక పూర్వులుగూడ నెందరేనియును
శంకలేకయె దీని చాటియున్నారు
మనస్వామి యోగసమాధియందుండి
కనినట్టి యానందగరిమంబునెల్ల
స్వానుభవంబాట చక్కగా దెలిపె
దానిని వివరింతు తగశ్రద్ధ వినుడు
అలసమాధిని నున్న యట్టికాలమున
గలిగినయానందగరిమంబు తెల్ప
అలవియె శక్తిలే దనుచు వచించి
కొలదిగ ప్రకటించె కోర్కెతో వినుడు
ఆసుఖమ్మెంతో తన్నావరింపంగ
వీసమేనియు నోట వెడలదు యూట
అందుచే మ్రింగుట యనునది లేదు
పొందుగా నిజనేత్రములును వక్త్రంబు
తెరచియుంచెడు నట్టి తెన్నులేకుండు

కరములు పాదముల్ కదలించుటకును
తలపు జనింపకే ధారాళమైన
అలశ్వాస యాడునో యాడదోయనుచు
కనుగొని నుడువంగ కష్టమైదోచు
జనులెవ్వరేనియు చాలబిగ్గరగ
అరచినగాని మాటాడినగాని
అరయ విన్పించరా దావంతగాని
యీరీతికూర్చున్న నింకొక్కస్థలము
జేరంగ వాంఛను జెందడు యోగి
వెలుతురు వీక్షింప వేడ్కనుండకయె
అలజాగ్రదావస్థ నందినప్పుడును
చీకటిచోటనే చేరి కూర్చుండ
ప్రకటమ్ముగ సదా వాంఛించుచుండు
ఇతరులు మాటాడ నెంతమాత్రమును
ప్రతిజవాబు నొసంగ భావముండదుగ
యెంతటి గొప్పవా రెలమివచ్చినను
నుంతైనమాటాడ జూడరు మదిని
దీనికిహేతువు తెలియంగ గాంచు
ఆనందమునుపీడు టాత్మయొప్పమియె
అట్టి యానందమ్ము కా యోగబలమె
గట్టిగా మూలంబుగా నమ్మవచ్చు
యోగబలమ్మును నూనినవారు
బాగుగా చిత్తంబు బంధింపజాలి
అనితరసాధ్యమా యానందమెపుడు

తనకుతానే జెంది తన్మయుండగును
ఆసుఖంబింతని యలవియే పల్క
శ్రీ సచ్చిదానంద చిద్రూపుడెలమి
అంచితంబైన పద్మాసనమందు
యించుకగూర్చుండి యీసౌఖ్యమంది
ఆపైన భిత్తిక కానించియున్న
పీటపైనైన నేదండునైన
చరణముల్ పొందుగా జాచియుపైన
కరయుగ్మమును స్వేచ్ఛగానుంచుకొనియు
యూరకకూర్చుండి యుండునప్పుడును
ఆరీతిసౌఖ్యమ్ము నందుచునుండు
నిటులకొంతటిసేపు నింపుమైనుండి
నటుపైన తలగడకానిచ్చియుండి
పరచినపాదముల్ బాగుగనిలిపి
వరుసగ కుడికాలుపై వామపాద
మునిచికరమ్ముల నొకటఘటించి
తనదుమోకాళ్ళలో తగజేర్చియున్న
నావిధసౌఖ్యమ్ము నందగావచ్చు
ఆవల కొంతసేపైన యంతటను
యెడమపాదమ్ముపై యీరీతిగాను
కుడిపాదమూనియు కూర్చుండియున్న
ఒదవును సౌఖ్యంబు నొక్కవిధమ్మె
తదుపరిమోకాళ్ళ తగిలించియున్న
చేతులదీసియు స్వేచ్ఛగాయుంచి

ఆతీరుకూర్చున్న నాసుఖముండు
ఆలీల తలగడనాని కూర్చుండి
కాలును మార్చియు కాలుపై కాలు
వేసియు కూర్చున్న వివరించిచూడ
ఆసుఖమట్టులే నందంగవచ్చు
విడువక సరిచుగువిధము కూర్చుండి
యెడమ కాలిమడిమ నింపుమీరంగ
కుడిపిరుందనుదూర్చి కుడిపాదమడివు
యెడమమోకాలుపై స్వేచ్ఛకూర్చున్న
ఆరీతి సౌఖ్యంబు నందనౌ; దీని
వీరాసనంబని విజ్ఞులాడెదరు
ధారుణీదైత్యవధం జేసియున్న
శ్రీరామచంద్రుండు చెలగి నిత్యంబు
వీరాసనమ్మునే వేయధిష్ఠించు
వారనియార్యులు వాకొనుచుంద్రు
ఆ పైనగొంతుక యట్లుకూర్చొనియు
వీపునమోకాళ్ల వెడదయౌయోగ
పట్టమ్మునదగిల్చి పరగమోకాళ్ళు
నట్టెరొమ్మునజేర్చి యామధ్యయందు
రెండుమోచేతుల రెండుచేతులను
నొండొంటితోజేర్చి నొనరగూర్చున్న
ఆసుఖమట్లుండునదె యోగపట్ట
ఆసనంబని పెద్ద లనుచుందురెలమి
ఆరీతియామీద స్వాభిలాషముగ

ధనమిచ్చెదనటంచు తగపల్కువారు
ఘనమైనశ్రద్ధ యా గ్రంథమ్ములెల్ల
పరిపరిరీతుల పరిశోధించి
అరయ మేమింతగా నైనరచింప
జాలమటంచును సరగ వచించి
చాలకౌతుకమంద జాలిరి మదుల
యిన్నివిధమ్ముల నిటుల లిఖింప
నెన్నగాహేతు వదేమియంచనిన
చదువుసంధ్యలులేని జనుడైనగాని
విదితమ్ముగా లోకవృత్తాంతములను
తెలియజాలనివట్టి దేబయైనను
సలలితమాయోగసాధనసిద్ధి
బడసినమాత్రాన పండితుండగుచు
బుడమివిజ్ఞానియై భూరిసత్కీర్తి
గాంచును నీలాటి గ్రంథముల్ వ్రాసి
అంచితమ్ముగ నిత్యమాముష్మికమును
సాధింపనెంచెడు సజ్జనతతికి
సాధనజూపింప జాలు నింపెసగ
శ్రీయోగివారలీరీతిగ్రంథమ్ము
లాయోగబలమునే నలర రచించె
గానియాత్మీయమై కల్గినయోజ
లూనిలిఖింపమి యూహించుకొనుడి
యీపైనజెప్పిన నెల్లసంగతుల
నేపొల్లులును లేవు దృఢమంచుగనుడి

# శ్రీ సచ్చిదానంద యోగీశ్వరులవారి యొక్క విద్యాభ్యాసమును తెలుపు పాట.



శ్రీ సచ్చిదానంద చిద్రూపయోగి
వాసిగాపఠియించు బడిలోనపదియు
నెనుబదివందల యెనుబదినోట
అనితరబోధనాభ్యాసంపుపటిమ
తరగతుల్ నాల్గాదితగమిడిల్‌స్కూలు
వరకును తరగతుల్ వరలెనచ్చోట
ఆమిడిల్‌స్కూల్కునే ఆంగ్లేయప్రభువు
లీస్కెయిమెట్రిక్యు లేషనంచనిరి
ఆమెట్రిక్లేషనునందు జేరంగ
పైమరియును మూడుఫారముల్ చదివి
అల్ల లోయరుఫోర్తు నప్పరుఫోర్తు
లెల్ల జదువ మిట్రిక్లేషనువచ్చు
దనపెద్దలింటిలో తననుబ్రేరేప
మనయోగిచంద్రుండు మమతతోడుతను
అట్టులోయరుఫోర్తు నన్నతరగతి
కెట్టెట్టులోవచ్చి యింకపై చదువ
మానసమ్మునవాంఛ మరిలేకయుంట
మానివైచె పఠింపబడికినేగంగ

చదివెడు వేళను సరస బాలురకు
నాదవు జ్ఞానమువీరి కొదువకుండుటను
బాలురందఱ తుది బాలుడై యుండి
హేళనగావింప నెంతయోపడుచు
ప్రతిదినమ్మును తనపాఠముల్ రామి
నతులితమ్ముగ నాగ్రహంబందిగురుడు
ఉదయసాయంత్రమ్ము లొక్కరీతిగనె
వదలకనిల్వమీ బల్లపైననిన
తనతోడి బాలురం దిలవంపుగాగ
అనయమ్మునిలుచుండు నతిశ్రమగాగ
అట్టిమొద్దుగనున్న యాబాలుడిప్పు
డెట్టుగాలోకమ్ము లెల్ల మెచ్చగను
జేగీయమైనట్టి జీవబ్రహ్మైక్య
యోగసారఖ్యాతి నొప్పుచుండగను
పెద్దపొత్తముగాగ వేయిపైపుటలు
తద్దయుమించగా దక్షుడై వ్రాయ
గలిగెనో యద్దానికారణం బిప్పు
డెలమిని ప్రకటించె నిచ్చోటకనుడు
ఆదిని శ్రీ సచ్చిదానందయోగి
సాదరమ్ముగ యోగసాధనంజేసి
స్వానుభవంబును జగమున చాట
మానసంబునకోర్కె ప్రభవించెమిగుల
తలపుగల్గినయంత తానుయోగంబు
సలుపుగదిని నిశాసమయమ్మునందు

యోగసాధన జేసి నొకగంట సేపు
బాగుగానిష్ఠలోపలను గూర్చుండి
యానిష్ఠవిడచిన యాక్షణమ్మున నె
పూసిక నంతకు మున్నెసిద్ధంబు
గను జేసియుంచిన కాగితమ్ములును
పెనసలు, దీపిక వేడ్కతో గాంచి
దీపంబు వెల్గించి తెల్ల కాగితము
లా పెన్సలును బల్లయచ్చోట నుంట
దాని పైనునిచియు తాముగూర్చుండి
ఆ నిష్ఠలోగల్గినట్టిజ్ఞానమున
పెద్దపాత్రంబైన వెనుదీయకుండ
తద్దయురచియింప దక్షుండై మించు
కాగితమ్మున చక్కగా నుంచుటాది
ఏగ్రంథివ్రాయునో యెఱుగ డావంత
ఎద్దానివ్రాయ నూహించునో మదిని
నద్దానినే వ్రాయు నత్యద్భుతముగ
కర్తయు క్రియయును కర్మయుకలిగి
పూర్తిగా భావము పొల్పొందవలయు
ననుచు దలంపుతో నటుల లిఖింప
ఘనమైన భావముల్ కర్తయు క్రియలు
కలిగియు విరచింపగల డెట్టిమహిమొ
తొలుతను చింత మొద్దుకు సముడయ్యు
చదువు లభింపని జనునకు నెట్టు
లొదవె నీజ్ఞానమ్ము నూహించుకొనుడు

కర్తకర్మక్రియల్ గలిగిభావముల
వర్తిలంగను వ్రాయ బాలబాలికలు
చక్కగ పఠియింప సౌలభ్యమగును,
నిక్కంపు భావంబు నేర్వజాలెదరు
కర్తకర్మక్రియల్ గలుగకుండకయె
వర్తిలు వ్రాతలు బాలబాలికల
కక్కట రవ్వంత యైనదోచేమగ
చక్కగ నుండదు సరసులుగన్న
ద్రవిడభాషనట కర్తయు కర్మ క్రియలు
పరివిమలమ్ముగనుండి పరమమోక్షంపు
శ్రీదమై భాసిల్లు జీవబ్రహ్మైక్య
వేదాంతపు రహస్య విపులనామమున
చిన్నపొత్తంబొండు శీఘ్రమే వ్రాసి
క్రిన్నన ముద్రణ గావించి దాని
నతిస్వల్పక్రయమున కారణాలకును
హితమతిగా విక్రయించెను తొలుత
రెండవకూర్పు ముద్రించెడివేళ
దండిగా నూత్నవృత్తాంతములందు
వలనొప్పగా జేర్చి పండ్రెండణాల
వెలకమ్మ క్రమముగా వృద్ధిగావించి
యోగబలమ్మున నూహలవెన్నో
వాగతీతముగాగ ప్రభవించుచుంట
ఆ భావములనెల్ల నం దిమిడించి
ప్రాభవమ్ముగవ్రాసె పండితుల్ మెచ్చ

తోరమ్ముగానిట్లు తొమ్మిదికూర్పు
లోరిమిమై వ్రాయ నగ్రంథమగుచు
వెల నాల్గురూకలు వేసియుండినను
కొలదికాలములోనె కొనుచుండిరెల్ల
రిపువదిమూడువే లీగ్రంథప్రతులు
అరయగాఖర్చగు టబ్బురమంది
అద్దానినే వేడ్క నాంధ్రమ్మునందు
పెద్దపొత్తముగా విరచనజేసి
ఆనామమేయుంచి అచ్చుకూర్పింప
ఆనందముగకొని రాంధ్రులెన్నని
యీపొత్తములె లోక మెల్లెడగూడ
వ్యాపించెజ్ఞానులు హర్షింపజాలి
రీయోగివర్యుని యించుకజ్ఞాన
మాయరవమునందు ఆంధ్రమ్మునందు
అలసంస్కృతపుభాష అణుమాత్రమేని
తెలియదు నీరీతి తెలియకుండినను
ఘనయోగబలమెంతో కల్గియుండుటను
తననేర్పుచేతనే తానులిఖించె
కానియన్యులకోరిగా వ్రాయరాయె
తానురచించిన తదుపరి బుధుల
జేరియు విన్పించి చేర్పగాం దగిన
మారహస్యములేని యింకయుండినను
వాక్రువ్వడీవాని వచ్చుముద్రణను
సక్రమంబుగజేర్చ జాలెద మీకు

పగటివేళలయందు వరయోగనిష్ఠ
తగనుండకుండుట తానుగ్రంథమ్ము
మొదలిడిలిఖియింపఁ బూనియుండినను
పదములుదోఁచేవు భావముల్ రావు
కాగితమ్మునునుంచు కలమట్లెయుండి
సాగదునోకపంక్తి సంగతిట్లైన
నిసివేళలను యోగనిష్ఠనువదల
అసమానమాశక్తి సట్లెజన్మించు
గానరాత్రులయందె గ్రంథమువ్రాయు
గాని పగటివేళ కాగితమందు
పెనసలునుంచంగ వేడ్కయే లేదు
మనయోగివార లీమాదరిగాను
పరివిమలమాజ్ఞాన మహిమమ్ముతోడ
దృవిడాంధ్రభాషల గ్రంథముల్ వ్రాయు
నపుడెవ్వరేనియు నంచితమైన
యుపనిషత్తులదెచ్చి యొసగుచుండగను
మనయోగివారలు మానసమందు
అనుకొనుసీరీతి నదివట్టులనిన
"వానిలోనున్నట్టి పరమస్వరూపి
వానిప్రేరేచియు వానిగ్రంథమ్ము
మనయొద్దకంపుట మదినియోజింప
అనఘుమావిషయ మేమైననుగాని
మనగ్రంథముననున్న మాటయే నిజము"
అనుచును నాత్మలో నాహ్లాదమంది

ఆపాత్తముల నెల్ల నపుడె శోధించి
జేపట్టదగియున్న శిష్టవాక్యములు
గైకొని యాత్మీయగ్రంథమ్మునందు
ప్రకటమ్ముగ తాను ప్రకటించుచుండు
ద్రవిడభాషనుగూడ గ్రంథమ్ము వ్రాయ
నవసరమ్మునగూడ నటులెవ రేని
సందర్భమైనట్టి సంగతుల్ దెలుప
పొందుగా తనపాత్తమున జేర్చుచుండు
గాని వేయుపనిషగ్గ్రంథమ్ము లేని
మాననీయంబైన మరియెట్టియితర
పాత్తమొక్కటి తన పొంత నే లేదు
విత్తమ్ము చేకూర్చి పెట్టుటే లేదు
పరమాత్మ ప్రేరేప పరతంత్రులగుచు
పరులొసంగెడి గ్రంథపంక్తియా యుపని
షత్తులలోనున్న సత్తునంతటిని
మొత్తమ్ముగను జేర్చి పాత్తమందుంచు;
ఆపాత్తములయందు హత్తించుటకును
పైపగిదిగను పెద్దవైద్యులువచ్చి
హృదయపటమ్ము వెన్నెముకపటమ్ము
మొదలుగా తనువున పొల్చెడి రక్త
నాడులపటములు నానాపటాలు
వేడుకమై దెచ్చి వేయిచ్చుచుండ
వానిని ముద్రిణా పత్రములుగాగ
తానుచేయించి తత్సందర్భములుగ

నునిచియు పఠియించు చున్నవారలకు
ననుపమానందమ్ము నందంగ జేయ
వారక శ్రీజీవబ్రహ్మైక్యవేద
సారంబుననునట్టి సద్గ్రంథ మొండు
శ్రీ సచ్చిదానంద చిదూ్రపయోగి
భాసురంబై యొప్పు పదజాలమునను
వ్రాసియున్నారలు పఠియింపు డెలమి
వ్రాసిరే కాని యావ్రాసినపిదప
అచ్చుకూర్పించెడి నట్టికాలమున
యెచ్చటేనియుగాని నేమేనిదోసగు
లున్న వేమోకాంచు డీయంచుసుంత
ఎన్నఁడేనియుదాని యిచ్చియునందు
పరిశోధన మొనర్ప పండితవరుల
కెవ్వకసేయకెయుంట యీరుపఠింప
సోదరసోదరీ శుభమతులార
పైదానిలో కనుపట్టుదోసములు
కరుణించి క్షమియించ గావలెననుచు
పరిపరిరీతుల పరమహంసయనుచు
వాసియువన్నెయు వహియించివెలయు
శ్రీసచ్చిదానంద శ్రేష్ఠయోగీంద్రు
లెంతేని తెల్పెను నీగ్రంథమందు;
సంతసమ్మున దీని చదువువారలకు
పరమదీర్ఘాయువు భవ్యసంతతియు
సిరియుసంపదయును చేకూరుగాత.

# శ్రీ సచ్చిదానంద యోగీంద్రులవారి పూర్వాపరజన్మ చరిత్రము.



శ్రీలకావాసమై శ్రేష్ఠమైయొప్పి
చాలపవిత్రమై సన్నుతిఁగాంచి
పంచమహాక్షేత్ర పట్టణమ్ములందు
ఎంచగాప్రథమమై యెన్నికఁగన్న
కాంచిమహాక్షేత్ర గరిమంబునందు
అంచితవైభవం బందుచున్నట్టి
వెలమవంశమునందు వెలయరక్తాక్షి
అలమాఘమాసమ్మునందు బహుళ
పంచమీగురువార భవ్యదినమ్ము
నెంచగా ఉత్తరా ఋక్షమ్మునందు
సింహలగ్నము జనించెను అలయోగి
సింహంబుగా భువి స్థిరకీర్తిఁబడయ
యుల్లంబులను బంధు లుల్లాసమంద
నల్లారుముద్దుగ నలరుచుండెనుగ
యీరీతిబాల్యమ్ము నించుకగడువ
ధీరుఁడై బుద్ధిచే తేజరిల్లంగ
ఘనత పచ్చయ్యప్ప ఘనపాఠశాల
వినుతిఁజెందగ నాంధ్రవిద్యయేగాక
ద్రవిడభాషనుకూడ దంటతనాన

పరివిమలబుద్ధిచే పఠియించుచుండ
ద్వాదశాబ్దమ్ముల బాల్యమ్మునందె
మోదమ్ముతో నిట్లు బుద్ధిదలంచె
నీపురమందున నిన్నికోవెలలు
యేపారిదేవత లిందరుండుటను
కావున రేపటి కడుభక్తితోడ
దేవాలయమ్ముల తేకువగాంచి
యిన్ని దేవులయందు యే దేవునైన
పన్నుగనొక్కని భావమందెంచి
స్థిరబుద్ధినేనింక సేవింతునంచు
నిరుపమభక్తిచే నిజబుద్ధిదలచి
మఱునాటియుదయమ్ము మఱినిద్రలేచి
అరుణమ్మునను నీశు నాత్మలోఁదలచి
వడికాల్యకృత్యముల్ వరుసగావించి
యెడదసంతోషమ్ము నెంతేనిగలుగ
జలకమ్ములాడియు స్వచ్ఛమౌవస్త్ర
ములనప్డు ధరియించి మోదమ్ము జెంది
కోవెలలన్నియు కోర్కెమైగాంచి
భావపరిపూర్ణుఁడై పరమహర్షమున
ఏకాంబరేశుని హృదయమందుంచి
ఏకాంతభక్తి సర్వేశ్వరాయనుచు
స్వాంతమ్మునముదమ్ము నలమికొనంగ
నెంతేనినుతియించి గృహమును జేరి
అరయగా నిదియెంత ఆశ్చర్యకరము

పరమేశునకురూపబహుళమ్ముకలదె
ఒకరూపమునతాను నొప్పుచుండకయె
ఒకచోటపెద్దగా నొకటచిన్నదిగ
ఒకటిపొట్టిదిగాఁగ నొకటియెత్తుగను
ఒకటిభీతినిగొల్పు చున్నట్టులుండు
ఒకటిప్రసన్నమై యుండినట్లుండు
ఒకచోటకన్పడ కుండియుండునుగ
అనుచుబుద్ధిని చాల యాలోచనములు
జనియించితుదకిట్టు లనుకొనదొడఁగె
శంకరుమతమున జన్మించియుంట
శంకరునేగొల్వ జాలెదనని
యీరీతియోజన లేలజన్మించె
వీరికంచనదాని వివరింతువినుడు
గతజన్మమున క్రైస్తవులందు
మతబోధగావించు మాన్యులై పుట్టి
''నరులారనామాట నమ్ముడి త్తరిని
పరమేశు డొక్కడే భావించిచూడ
ఇందరు దేవత లెందైనగలరె
పొందుగ క్రీస్తునే మ్రొక్కుడీ'' యనుచు
ధీవరుడై బోధ తేకువసల్ప
ఆ వాసనాబలం బమరియుండుటను
యీవిధమ్మునయూహ లిప్పుడుగల్గె
యీవృత్తము నెఱుంగ నెంచితిరేని
అనుపమజీవబ్రహ్మైక్యసారమ్ము

ననుచూడవచ్చు పూర్ణమ్ముగా మీరు
యీకోర్కె జన్మించ నెంతేనిభక్తి
యేకాంబరేశుని హృదయమందుంచి
ఆరేయితలపోసె నాత్మలో నిట్లు
వారక "తెలతెల్లవారినవెనుక
ఏకాంబరేశుని నెవ్విధమ్ముగను
ఆకోవెలనుగల్గు నర్చకుం డరయ
పూజగావించునో పోయివీక్షించి
ఆజగధీశుని కారీతిగా నె
మానసపూజను మఱిజేతు" ననుచు
ఆనందమువహించి అంతనిద్రించి
వేకువజామున వేడ్కమైలేచి
ఏకాంబరేశునినే స్మరియించి
అంతట కాల్యకృత్యంబులనెల్ల
సంతసంబునదీర్చి జలకమ్ములాడి
ఏకాంబరేశుని వీక్షింపనేగి
ఆకోవెలంగల్గు అర్చకుగాంచి
స్వామిసన్నిధికేను వచ్చెదననుచు
యేమాదిరినొ చెప్పి యొల్లొయొప్పించి
ఎంతేనిభక్తితో ఏకాంబరేశు
చెంతకుజేరి సుశ్రీవహింపంగ
ఆవేళ నర్చకు డర్ఘ్యపాద్యముల
దేవునిపూజించు తీరువీక్షించి
యీ నియతిగ నేను యెల్లవేళలను

మానసపూజనే మఱువకఁజేతు
అనుచుసర్వముతాను ఆత్మగ్రహించి
తనగృహమ్మునకేగి తదనంతరమ్ము
తనయింటనొకమూల దనరుచున్నట్టి
ఘనమైన నొకపూజగదిలోనజేరి
తలుపులుబిగియించి తతపీఠమందు
సలలితమగా లేడిచర్మంబువైచి
అద్దానతాను పద్మాసనస్థుడయి
తద్దయు చిన్ముద్ర తనచేతఁబట్టి
కనులనుమూసి వికారమ్ములేక
మనసులో సృష్టి నీ మాదరిజేసె
భూమిమధ్యకనుపించు భూరియాబయలు
నామూలముగఁజూచి యన్నిప్రక్కలను
యెత్తైన ప్రహరికి నెంతేనియొప్పు
భిత్తికల్ స్వర్ణమై విలసిల్లగాను
ఆగోడలకుమధ్య నలపూర్వదిశను
తా గోపురమునిల్పె తగహేమమునను
కలశముల్ పదకొండు కల్గిగోపురము
విలసిల్లవలెనంచు వేడ్కజెందంగ
ఆపొల్కియైనంత ఆప్రహరికిని
గోపురమ్ముకుముందు గొప్పదై యుండు
మనయోగిధ్యానించు మహనీయమూర్తి
ననుపమసర్వభక్తార్థసంసిద్ధు
డేకాంబరేశునికే స్థానమూల

మహా కోవెలయొకండు అందుండ నటుల
కనకమ్ముచే దాని కట్టిముగించి
అనువుగా నచ్చోట నరుగునొక్కటిని
స్వామిప్రతిష్ఠింప స్వాంతమందెంచి
ఆమీద రత్నంబు లంమెవెల్గగను
అద్దానిపై యీశు నటుప్రతిష్ఠించి
ఒద్దికమై యందు నొప్పగానున్న
దైవప్రసాదముల్ దగనిల్ప పీఠ
మావేళదలపెట్టి నాత్మలో నపుడు
పరమేశ్వరున కిరుపార్శ్వములందు
వరలబంగారుదీపంపుసెమ్మెలను
కంచుగంటలతోడ ఘల్లున మోగియు
మించుహేమమ్మున మెరయుతల్పులను
మొనసిగర్భాలయమ్మునకు తగిల్చి
అనుపమరత్నమయమ్ముగా నుండు
కోవెల నీరీతి కొనసాగఁజేసి
ఆవల యీశుని కనుదినమ్మునను
నైవేద్యమునకు మహానసశాలయొండు
యీవిధమ్మున మేటిహేమమ్ముతోడ
తలపున నిర్మించి తత్స్థలమందె
వెలగల్గు రత్నసంవిలసితమ్ముగను
సోపానములు పది శోభిల్లుచుండ
వాపిని నొకదాని భావమందెంచె
అచ్చట గలగంగ ఆరుమెట్లకును

వచ్చుటకును నెంచ వచ్చియుండెనుగ
అందుపై యీశుని కర్పించుటకును
పొందుగా ఫలపత్రి పుష్పములెన్నొ
వరలెడు నందన వనముండునట్లు
స్మరియించినంతనే సమకూరె నచట
యీవిధమ్మున తాను హేమమ్ముతోడ
కోవెల గోపుర కోనేరువనము
లెలమినిసృష్టించి యేకాంబరేశు
అలఘుతరమ్ముగా నభిషేకములను
గావింప పదమంది బ్రాహ్మణోత్తముల
వేవేగరావించి వేదమంత్రముల
అభిషేకములుజేసి యంత నైవేద్య
అభివాదనమ్మున నన్నియుజేసి
తలుపులుమూసెడు తరుణమ్మునందు
ఘలుఘల్లనుచు కంచు గంటలుమోగు
యోగమందునసిద్ధి నొందెడుదనుక
యీగతి పుష్కరం బింపుగాగడపె
పదియును మూడవవత్సరంబందు
సదమలబుద్ధియా సద్గురుండతడె
తనయంతదావచ్చి దయతోడగాంచి
వినిపించె యుపదేశ విధులనుకొన్ని
కోరకే యోగమ్ము కొరకు రేచకము
పూరక కుంభకమ్ముల దెల్పిచనియె
అరయగా మనస్వామి కపుడు పాత్రయమ్ము

ఇరువదినాలుగు యేడులుండెనుగ
ఇరువదియైదవ యేటనే స్వామి
పరిణయమయ్యెను భవ్యసుశీల
యిరువదివత్సరా లెంతో గొప్పగను
తరుణితోడగృహస్థ ధర్మంబునడపె
నిజకాంత తనపాదనీరజమ్ములను
భజియించుచును చాల భక్తితో గొలువ
ఆనాటి కానాటి కభివృద్ధియగుచు
మాననీయప్రయోగమహిమంబువలన
జాలిసుంతయులేక సంసారమందు
చాలవిరక్తుడై సతి విడనాడి
ఏకాంతముగ తపం బేవేళ జేయ
ఏకొండగుహలకో నేగుచుండ
తనభర్తగాంచంగ తహతహ జెంది
చనియుండజాలిన జాడలదీసి
గైకొనివచ్చియు కడుభక్తితోడ
ఏకాంతముగనుంచె నెన్నేనిసాళ్లు
అంత కొన్నాళ్ళుండి అరుగుచుండగను
చింతించెనిటుల తచ్చిత్తమ్మునందు
నాపాపమేమియో నామనోధవుడు
తాపసేంద్రులరీతి తపముసేయుటకు
కొండలగుహలలో కూర్చుండియోగి
మండనుడైయుండ మది నెంచుచుండు
ఐశ్వర్యమునబంధు లందరిలోన

ఈశ్వరకరుణచే హెచ్చుగానుండి
భక్తియోగమ్ముల భవనమ్మునందె
యుక్తమ్ముగాజేయ నొప్పదేయనుచు
తానుగూడనుభక్తి తత్పరయగుచు
మానీందులకునెల్ల మానసోల్లాసుఁ
డైనశ్రీకృష్ణుడున్నట్టిపటమ్ము
పూనికగాదెచ్చి పూజించదొడఁగె
ఆయమయెంత మాహాత్మ్యంబువలన
ఈయిలబుట్టెనో యెఱుగశక్యంబె
శుక్రవారమెపుట్టె శుక్రవారమెపెండ్లి
శుక్రవారమెయయ్యె నూపుష్పవతిగ
శుక్రవారమునాడు శోభనంబయ్యె
శుక్రవారమునాడు సొచ్చెస్వర్గమ్ము
పతియోగివర్యుడై వనముల గుహల
సతతముచరియింప స్వాంతమ్మునందు
చింతిల్లిచింతిల్లి చింతచేవ్యాధి
ఎంతయోవచ్చిన నెట్టకేలకును
అవసానదశవచ్చి ఆవరించినవేళ
పరివిమలమతి కృష్ణపటముదెప్పించి
శ్రీకృష్ణుపైననే చిత్తమ్మునిల్పి
"నాకువెన్ననిడవా నాకు పాలీయ
వా"యంచు జీవంబు నతసిలోజేర్చె
ఆయమ బందుగు లందరేడ్వంగ
తరువాత మనయోగి తనధర్మపత్ని

గరళకంఠుపదమ్ము గాంచినంతటనె
అమలయోగధ్యానుఁడై ఆశ్రమంబు
క్రమముగాఁగైకొని ఘనులెల్లఁగొలువ
అలచెన్నపురిలోన వ్యాసరుపాడి
నిలిచెనుకొన్నాళ్ళు నిస్తులతపము
గావించుచటుమీద కడపజేరంగ
ఆవాసయోగ్యమై అందుకన్పడమి
నాలుగుకొండల నడుమగానుండి
గ్రాలెడి గడికోట గ్రామంబుచేరి
కలుముల విలసిల్ల గలరైతులందు
బలవంతులై యొప్ప వరసామిసాని
కులజులందరిలోన గొప్పగా సతము
చెలువొందుచున్నట్టి శ్రీవీరనాగి
రెడ్డిఁగారినిగాంచి ప్రేమించి "నీవు
దొడ్డవాడవటంచు తొలువార్తవింటి
కనుగొంటిముదమిప్డు గాంచగానుంటి"
అనిపల్కి హర్షించు నట్లొనరించి
అనువొప్పదేశమ్ము నారెడ్డినడుగ
మనయోగికారెడ్డి మరియిచ్చెస్థలము
దానిలో మఠమొండు తానునిర్మింప
బూనెగా పనియిప్డు పూర్తియౌచుండె
యీవిశేషములెల్ల యెఱుగంగనున్న
జీవబ్రహ్మైక్యమ్ము చే దెలియుండు.



# మృగములు స్త్రీపురుష రూపమునుబొందు రహస్యార్థము.



పలుకువెలందికి ప్రాణేశుడైన
నలువత్రా నెనుబది నాల్గులక్షలుగ
జీవరాసులసృష్టి చేసినవిధము
నేవివరించెద నిజముగవినుడి
పచ్చిగడ్డిగతొల్త ప్రభవించి అందు
హెచ్చుగాపుణ్యమ్ము నెలమినిజేయ
కసవులోపల పూలుగా పుట్టియందు
అసమానపుణ్యంబు నాచరించుటను
వృక్షములై ప్రభవించియు నందు
అక్షయమ్ముగపుణ్య మార్జించగలిగి
శిలగాగ జన్మించి చేయుపుణ్యమున
పులుగుగాగను జన్మ బొందియునంత
ఏకల్మషములేక యిలనువర్తించి
ప్రాకుడుజంతువై ప్రభవింపజాలి
అగణితపుణ్యంబు సందాచరించి
మృగముగజన్మించి మిగులపుణ్యమున
అన్నిజన్మములందు నతిశ్రేష్ఠమగుచు
మెన్నికగాంచియు నెంతేనివరలు

నరజన్మమెత్తుచున్నార లందునను
తగుణియై పురుషుడై ధరబుట్టునట్టి
వారిలోతొలియేదో వలెనెవ్రాయంగ
యీరీతినరజన్మ మెత్తియుండినను
పరమేశుపై భక్తి ప్రజ లందరియెడఁ
గరుణయు రవ్వంత కలిగియుండగుగ
గోవులుగేదెలు గుఱ్ఱంబు లెద్దు
లేవేనిపరుగున నేగుచున్న
యీలాగుయివివచ్చు నెరుగకున్నట్టి
బాలురై నను లేక బాలికలైన
త్రోవకడ్డంబైన తొందర లేక
జీవకారుణ్యమ్ము చేత పిల్లలను
త్రొక్కకే తమయంత తొలగిపోవంగ,
అక్కటామనుజుల కంతమాత్రమ్ము
కారుణ్యబుద్ధియే కాన్పించదాయె
యీరీతియగుచుంట యెల్లరెఱుంగు;
కసవౌట మొదలుగా కడుజన్మలెత్తి
పసరములై పుట్టువరకు దానచ్చి
మంచిపుణ్యమొనర్చి మానవజన్మ
గాంచినంత నెముక్తి గాంచంగలేరు
పుట్టుచుగిట్టుచు పుట్టుచు గిట్టు
చిట్టులే నరజన్మ నెత్తుచునుండ
తనజన్మలందున తఱచుపుణ్యంబు
నొనరించ నొనరించ నొక్కజన్మమున.

అణుమాత్రి మీశుని యందున భక్తి
గణియింప నాజన్మ గలుగంగనేర్చు
క్రిమముగా నీరీతి ఘనభక్తిగలిగి
విమలవృత్తినితాను వెలయుచుండంగ
పరిపక్వమునుబొంది పరమసుకృతిని
వరయోగిన్నైు తరువాత జ్ఞానియయి
పరవస్తువౌ పరబ్రిహ్మమ్మునందు
నరులెల్లరైక్యమౌ నమ్ముడిద్దాని
యీ తెల్పినవిధమ్ము ఋజుమార్గమనకె
చేతమ్మునను శంక జెందెదరేని
దానిదృష్టాంతమ్ము తగురీతిగాను
ఏనువచించెద నిత్తరివినుడి
పదివత్సరములకు ప్రిజలెంతమంది
ఉదయించిరో చచ్చిరో తెలియంగ
మనదేశమేలెడి మనచక్రివర్తి
అనుపమ"సెన్సెసు" ననుచొక్కలెక్క
గావించుచుండుట గాంచమేయందు
నావత్సరముకన్న నావత్సరమ్ము
ప్రిజలభివృద్ధిచే ప్రిబలుచొండుటను
అజుడునూతనసృష్టి నాచరించుటలు
తలపకుడీమీరు తథ్యమ్ముగాను
తొలి పచ్చిగడ్డిగా తోచినయట్టి
కసవెయీరీతిగా కాలక్రిమమున
అసమాననరజన్మ మందెనుసుమ్ము

ఇట్టికష్టంబైన యీనరజన్మ
పుట్టినందుకు జ్ఞానమును గడియించి
దేవతారాధనల్ తీర్థసేవలును
గావించుచును పుణ్యకథలను వినుచు
సూనృతంబాడుచు సుకృతకార్యముల
బూనికగావింప ముక్తినిగాంచు
అటుగాక సాధుల నందరతిట్టి
కుటిలురై యెల్లరి కొంపలుగూల్చి
వ్యభిచారులై చోరులై సంచరింప
పరిభవించెదరుత్తిర్గి పసరమ్ములగుచు
పాపమ్ములొనరించ వ్యాధులువచ్చు
పాపమ్ములొనరించ వచ్చులేమిడియు
పాపమ్ములొనరింప బాధలుగల్గు
పాపమ్ములొనరింప బహుదుఃఖమబ్బు
పాపమ్ములొనరించు వారికి తుదకు
ఊపిరిపోవగా నుగ్రమ్ముగాను
కాలునిదూతలు కడగండ్లపెట్ట
గోలుసనేడ్చిన కూడునే ఫలము
ఒక్కొక్కజన్మలో నొనరించుపాప
మక్కటా మరణించి నంతనె దాని
తానువహింపక తప్పదింతేని
దానినెగా సంచితంబని యందురి
పున్నెమైననుగూడ బోదుసంచితము
క్రిన్ననజనుదెంచుగా జీవికరయ

ఈవిశేషములెల్ల మెఱుగంగనున్న
జీవబ్రహ్మైక్యమ్ము చే దెలియుండు.



# కామక్రోధాది దశగుణములు.



కా మ ము.

దారలసుతులను ధనధాన్యములను
ఆరామములప్రీతి నధికమ్ముగాను
గలిగివర్తించుటే కామేచ్ఛయందు్రి
అలివేణులంగాంచి అతిమోహమంది
నానావిధమ్ముల నరకానురుండు
హీనుడై భ్రష్టుడై యిలమీదఁగూలె.

క్రో ధ ము.

కపటియైపెరవారి గాసిపెట్టుచును
కుపితుడై యుండుటే క్రోధాగ్నియందు్రి
క్రోధియై సజ్జనకోటి నెల్లపుడు
బాధించి బకుడీల్గె పవనజువలన.

లో భ ము.

ఇతరులకీయగా నిష్టమ్ములేక
సతతము తామెక్క స్వాంతమునందు
ఆసనహించుటే అరయలోభంబు
ఆసుయోధనుడిట్టి దాలోభమూని

సూనుల బంధుల సోదరావళిని
ప్రాణమ్ము రాజ్యమ్ము బాసెయుద్ధమున.

మోహము.

వనితపై సుతులపై వాంఛతో సతము
మునుకొనియుండుటే మోహంబనంగ
తతమోహమునగాదె దశరథేశ్వరుడు
సుతునడవికినంపి చొచ్చెస్వర్గమ్ము.

మదము.

సిరిగల్గెననుచును చెలరేగి గర్వ
పరుడౌచు కారుల పల్కుటే మదము
ఈ మదమ్మునగాదె యిల కార్తవీర్య
డౌమెయి ప్రాణంబు లానాడువిడిచె.

మత్సరము.

ఒరులగొప్పనుగాంచి యోరువలేక
పరులదూషించుటే పరగమత్సరము
మత్సరుండైమున్ను మాధవుచెగడి
కుత్సిత శిశుపాలకుం డేగె దివికి.

దంభము.

జనులెల్ల తనచెప్పు శ్లాఘింపకోరి
పనులొనరించుటే పరగదంభంబు
అలపురూరవుడెట్టు లట్టి దంభమున
ఇలనువర్తించిన దెఱఁగియేయుండు?

## దర్పము.

శౌర్యంబుజూపుట స్థైర్యంబునుంట
ధైర్యంబుగాంచుటే దర్పంబటండ్రు
తనదర్పమునుజూపి దాశరథికిని
ప్రణతుడై మ్రొక్కడే పరశురాముండు.

## ఈర్ష్య.

తనకెన్నొ కష్టముల్ తనరియుండినను
తనతోడివారును తనవిధమ్ముగను
అనుభవించగనెంచు టదెయీర్ష్యయండ్రు
అనయమీర్ష్యగ్రహించె హరిసాత్యుడిలను.

## అసూయ.

అపకారమొనరించు నతనికి తిరిగి
అపకారమొనరించు టదియె అసూయ
హేల నసూయను నెంతయోదాల్చి
వ్రీలడే మును పౌండరీకవాసుండు
యీవిశేషములెల్ల నెఱుగంగనున్న
జీవబ్రహ్మైక్యమ్ము చే దెలియుండు.



# శరీరములోనుండు దశవాయువులు.



1 హృదయమందుండియు నెప్పుడుతిరుగు
నదెప్రాణవాయువు నరసిచూడంగ
ముక్కులలోగుండ పోవుచువచ్చు
చెక్కుడుసౌఖ్యంబు నిచ్చు మేనికిని

2. మైయంతదిరుగుట మాని యపాన
వాయువుగుదములో వసియించియుండి
మలమూత్రముల నెల్ల మఱిభోగసమయ
ములశుక్లశోణితంబుల బైకిద్రోసి
నాసికాయుగళరంధ్రములలోగుండ
శ్వాసనుబయటికి సాగనంపెడిని

3. అలకంఠబిలవాసి యై యుదానంబు
జలమునుతినువస్తు సముదాయములను
లోనికిగొనిపోయి లోనరసముగ
తానొనర్చు తిను పదార్థమ్ము లెల్ల
మననిద్రవేళను మనయింద్రియముల
నొనరించుగాఢాంధ మొందునట్లుగను
నిద్దుర లేచిన నిమిషమ్మునందె
తద్దయు జాగ్రత తగనొనరించు
అంతనింద్రియము లామాకార్యములను
సంతసమ్మునచేయఁ జాలుచునుండు

4. నాభిప్రదేశమ్మునను సమానంబు
ప్రాభవమ్మగనుండి పైయుదానమ్మ
వలనజీర్ణించిన వస్తువులరస
మెలమినినాడుల కెల్లపంపుచును
తనువువృద్ధినిగాంచ దగినట్టివిధము
నొనరింపంగాజాలి నొప్పునుసతము

5. వ్యానవాయువు దేహమంతయు బల్మి
చేనిండిపోకెడి శీతోష్ణములను
తెలుపజాలుచునుండి తిన్నవస్తువుల
గలరసమ్మును పిప్పిగ గలపదార్థ
ములవేఱుజేయుచు పొల్పొందుచుండి
యెలమినియీవ్యాన మీరీతినుండు
యీవైదువాయువు లెల్లజీవులను
కాయమిచే పంచప్రాణంబులందురు
వాయువులందున ప్రాధాన్యమగుచు
యీయువిజీవుల కెంతేనియొప్ప
నాగకూర్మకృకర నగదేవదత్త
నాగధనంజయ నామంబులొంది
విలసిల్లుచుండును వివరింతువాని
గలతెలుంగునునిందు కడుతేటగాను

6. నాగవాయువల కంఠమ్మునందుండి
బాగుగ వస్తువుల్ పరికింపజేయు
వాంతులుగల్గిన పట్టులందునను

యెంతయోమూలమై యెసగుచుండునుగ
కన్నుఱెప్పలుమూయ గల్గిన తెఱచు
7. కొన్నసూతమునిచ్చు కూర్మవాయువయు
8. తుమ్మును నెళ్లని తోడ్తెచ్చుకృకర;
9. మెమ్మెయి త్రేపుల నెన్నని దెచ్చి
ఆవలింతలువచ్చు నట్లొనరించు
దేవదత్తంబన్న దివ్యమారుతము
10. ప్రసవమ్మునందు గర్భమ్మునుండి
శిశువునుబయటికి చెచ్చెరతోత్రియు
టంతియేగాక ప్రాణాంతమైయున్న
నెంతయు దేహమ్ము నే యాశ్రయించి
శవమును బ్బెడురీతి నల్పగాఁజాలి
దవిలినశించును దహనమ్ముగాగ
సరసులియ్యాదె ధనంజయవాయువంచు
పరగపిల్తురు దీని బాగుగగనుడి
యీవిశేషములెల్ల నెఱుగంగనున్న
జీవబ్రహ్మైక్యమ్ము చే దెలియుండు.



# సప్తచక్రములయందును శ్వాస నడచుచుండుట.



1. అలగుదస్థానమ్ము కధిపుడౌ వేల్పు
దలపగగణపతి; తద్దేవునకును
ఉదయమ్మునను గంట లొప్పగా నారు
మొదలుగ నిమిషముల్ మొగినల్పదైన
ఆరువందలశ్వాస నగునంతమీద
ఆరయ గణపతి ఆకలిమాన్పి
శ్వాస స్వాధిష్ఠాన చక్రమ్ముజేరు
2. ఆసమయమ్ము తదధిపుడౌ బ్రహ్మ
గణపతి విడిచిన కాలమ్మునుంచి
గణియించిచూడ పగలునొంటిగంట
ఇరువదినిముషమ్ము లెలమియౌవరకు
వరుసగా నార్వేలశ్వాసలునడచు
అంతటబ్రహ్మకు నాకలిమాన
3. మంతనమ్మునశ్వాస మణిపూరకమున
జేర తదధిపతి శ్రీవిష్ణునకును
శారదాధవుబాయ జాలినదాది
గడియింపరాత్రిరి గంటలెన్మిదియు
గడచుదాకనుశ్వాస ఘనతనందుండు
ఆవిష్ణుమూర్తికి నార్వేలశ్వాస

మా వేళకగునంత నతనియాకలియు
శమియించునంతట శ్వాసయనాహ
తమునందు జేరును తదుపరివినుడు
4. ఆయనాహతమున కధిపతిరుద్రు
డీయనరాత్రిరి యెనిమిదిగంట
లాదిగా వేకువ యందున రెండు
మీాదనలువది నిమిషములౌదాక
వరుసగ నార్వేల శ్వాసలు నడువ
అరయంగరుద్రుని యాకలీబోవ
తదనంతరము విశుద్ధమునకు జేరు
పదిలమ్ముగానంచు పండితులంద్రు
5. ఆ విశుద్ధంబున కధిపతియైన
జీవుండు రేయిని చెలగి లెక్కింప
రెండుగంటలమీాద లెక్కించిచూడ
నిండుగనల్బది నిమిషమ్ములాది
మూడుగంటలమీాద పొల్పుమీాఱంగ
ఆడును నలువదియారుక్షణములు
వేయిశ్వాసలు నాడు పిదపజీవునికి
ఆయెడ క్షుద్బాధ నపుడుచల్లార
ఆగ్నేయమున కప్పు డాశ్వాసనేగ
6. ఆగ్నేయమునకెన్న అధిపుడీశ్వరుడు
అలయీాశ్వరునికట యర్ధరాత్రిమున
నలిమూడుగంటల నలువదియేడు
నిమిషమ్ములాదిగా నిక్కమ్ముగాను

క్రమముగానాలుగు గంటలమీద
నెఱిని యేబదిమూడు నిమిషమ్ములైన
వరకునునొక వేయి శ్వాసలునడువ
ఆసడియీశుని ఆకలిమాన్పి
శ్వాసయప్పుడు సహస్రారమ్ము జేరు
7. ఆసహస్రారమ్మున కధిపతియాచు
భాసురమైయొప్పు పరమాత్మకరయ
హాళిని తెలవాఱు నపుడుగంటలను
నాలుగుయేబది నాల్గు నిమిషమ్ము
లాదిగా నుదయమ్ము నారుగంటలను
నౌదాక శ్వాస సహస్రంబునడచి
పరమాత్మయాకలి బాగుగమాన్పి
తరువాత యాగుదస్థానమ్మునందు
గణపతియుద్బాధ క్రమమొప్పగాను
అణచగవచ్చును ననుదినమందు
వరుసగా తానిరువదియొక్క వేయి
పరగనార్నూరుల పర్యాయములుగ
యేడుచక్రమ్ముల కేడు దేవతల
కాడుచునాకలి నట్టిచల్లార్చు
యీవిశేషములెల్ల నెఱుగంగనున్న
జీవబ్రహ్మైకమ్ము చే దెలియుండు.



# ప్రాణాయామోపదేశము.

చెలువైననొక చిన్న చీకటిగదిని
సలలితంబైన కృష్ణాజినముంచి
అమరంగనొకపీఠ మద్దానివైచి
ప్రమదతకూర్చుండ వలయునంతటను
పరిశుద్ధపాత్రలో పరిశుద్ధజలము
కరమనురక్తితో గైకొనివచ్చి
గుటకలుమూడింటి గ్రోలినేత్రముల
పటుమతిమూయగా వలయునంతటను
కుడియెడమలను ముక్కులను వ్రేళ్ళుంచి
యెడమముక్కున్మూసి యెంతేనినంత
కుడిశ్వాససంచిలో కూడియున్నట్టి
జడిమమా లోప్రాత శ్వాసనువిడిచి
మరలనోమనునట్టి మంత్రంబుమదిని
సరిగదలంచుచు శ్వాసలోజేర్చి
కుడిశ్వాససంచిలో కూర్చగాఁదగిన
పొడుగున అంగుళమ్ముల రెంటికయిన
శ్వాసనుపీల్చుచు సరగనిల్పుచును
భాసురలీల యభ్యాసమ్ముజేయ
తమపరిమాశ్వాస తగమ్రింగవలయు
వదలతగదుమ్రింగు శ్వాసను సుంత
ఇటులమ్రింగినమీద ఇర్వదియైదు

పటుమతి లెక్కించు వరకునునిల్పి
కుడిమూసియెడమ ముక్కున శ్వాసనెల్ల
విడువగావలెనట్లు వే నాలుగంగు
ళము'లో'మనియెడి మంత్రమ్మునుదలచి
క్రమముగా కుడిముక్కు రంధ్రమ్ము తెఱచి
యెడమముక్కునుమూసి యెలమిపైరీతి
విడువంగవలయు నివ్విధముగా శ్వాస
త్వరితమ్ము నణగెడు వరకుగావించి
భరముగనిద్దాని వాటించియుంట
కలిగినశ్రమయెల్ల క్రచ్చఱపోవ
తలపేమి లేకుండ తగనైదునిమిష
ములుకూరుచుండుట ముఖ్యమైయుండు
అలపెల్లదీఱును అట్లున్న వేళల
యీరీతికూర్చున్న యిట్టి వేళలనె
సారవిహీనమౌ సంసారవిషయ
ములుదోచుచుండిన ముక్కులోనికిని
అలశ్వాసపీల్చెడి నపుడు "సో" అనుచు
వరమంత్రముజపించి శ్వాసబయటకు
మఱిబాయ "హ" మ్మను మంత్రమ్ముదలచి
ఐదునిమేషమ్ము లరయసోహమ్ము
మోదమ్మునజపించ బుద్ధినిల్చునుగ
యిక్కరణినితాము నెడమయుకుడియు
ముక్కులవడిశ్వాసమునుబీల్చవచ్చు
తరువాతనాసికాద్వయమునపీల్చు

వరుసనువివరింతు బాగుగా వినుడి
మూడుగుక్కలనీరమునుత్రాగి నోరు
నోడక నేత్రంబు లాగిమూయవలయు
యెడదలో శాంతమ్ము నినుమడింపంగ
కుడియును నెడమ ముక్కులమీంద వేళ్ళు
నిడియును ముక్కుల నెడమంబుమూసి
కుడిముక్కు తెఱచియు కుక్షిలోనున్న
నాలుగంగుళముల నలిశ్వాసవిడిచి
వీలుగాకుడిముక్కు వేగంబుమూసి
ఎడమముక్కు దెరచి యెలమితో శ్వాస
విడువంగవలయును వీకసర్వమును
యీరీతి శ్వాసను యింపుతోడుతను
మారిచిమారిచి, మరినాలుగంగు
ళములశ్వాసయెపట్టు లాగుగామదికి
ప్రమదమ్ముగనుతోచు పట్టులందునను
కుడిముక్కులోగుండ కుక్షిలోనికిని
వడిమింగవలయును వైభవంబునను
ఇటులమింగినమీంద నింకనేమైన
యెటులైనపట్టునో యేమొకోయనుచు
అరయంగుళంబాది అయినంతశ్వాస
ఉరుశక్తిమింగగా నొప్పనుగాదె
యీమాదిరినిమింగి యెంతేనిపూన్కి
భూమిమధ్యనొకసంఖ్య పొల్పుగానుంచి
ఇరువదిన్నైదును నెంచెడిదాక

వరమనోదృష్టిచే భళిగాంచవలయు
అపుడుకూడనుశ్వాస నటుపీల్చువేళ
నిపుణతకుడిముక్కు నెటమూసియుంచి
యెడమముక్కునుశ్వాస నెంతేనిపీల్చ
బడుచునోమనుమంత్రి పఠనమ్ముచేయ
వలయుప్రాణాయామ భంగియుదెలియ
దలచినమీరలు తగుశ్రద్ధతోడ
యీవిశేషములెల్ల నెంతేనిదెల్పు
జీవబ్రహ్మైక్యమ్ము చే దెలియుండు.



## గ్రంథకర్త తొలుధొల్త నాద శబ్దమును వినుట.



ఆదినివీరు యోగాభ్యాసమందు
సాదరంబుగతాము సల్పెడివేళ
నిత్యంబురాత్రిళ్లు నిష్ఠలోనుండి
అత్యంతముగదాని నాచరింపగను
యీరీతిమాసంబు లెన్నియోగడువ
ఆరేయినర్ధంబు నౌనట్టివేళ
కుడిచెవియందున గొప్పగాధ్వనియు
వడిగానువినుపింప భావమ్మునందు

అబ్బురంబందుచు నరయనెప్పుడును
యిభ్భంగినాదమ్ము నెప్పుడువినను
అనుచునేత్రిమ్ముల నప్పుడు తెఱచి
కనుగొని పురుగేది గానియిచ్చటను
అరచుచున్నదియంచు నచ్చోటవెదుక
కరమనురక్తిని గైకొనిదీప
మంతయువెదకిన నచ్చటనేమి
సుంతైన తనకప్డు చూడగాబడమి
గదివీడిబయటకు గ్రిచ్చుఅవచ్చి
అదియేమొకనుడంచు అన్యులబిలువ
వారువచ్చియుగది బాగుగావెదకి
ఆ రావమొనరించు నట్టిదాపురుగు
నచ్చోట గానమీ యచ్చెరువంది
చెచ్చెరతమయిండ్లు చేరినయంత
మనస్వామివారలు మౌనసమ్మునను
ఘనముగా యోజించె కనిపెట్టదాని
పెరచోటకేగ తద్విధముగా రవము
తరచుగావినవచ్చె తగమంజుళముగ
అందుచేసంతోష మతిశయింపగను
నెందేనివిందుమే యీలోకమందు
అనుచుమెచ్చుచు మిత్రులందఱబిలచి
వినవచ్చునేమీకు వినుడుతధ్వనియు
అనుచుపల్కినవార లైరి మునిమిషము
లనువుగాగమనించ ఆవంతయేని

ఆరవమ్మునుతాము నాలించలేమి
ఔరయంచునువార లద్భుతమంది
సదనమ్ములకునేగ స్వామివారలును
అదిగ్రహింపగలేక అటులెయోగంబు
క్రమముగావృద్ధిని గావించుచుండ
అమితమ్ముగా నాద మతిశయింపగను
కుడియెడమచెవుల కొన్నిశబ్దములు
విడువకనిత్యంబు వినబడుచుండ
యీప్రణవపునాద మెలమిగ్రహించి
అప్రమేయంబిది అవ్యయంబనుచు
అత్యంతసంతోష మాత్మలోనంది
నిత్యంబుమనసుదీనను లయింపగను
గావించి ఆనాద గరిమంబునందు
వివిధనాదముల్ వినబడుచుండె
ఆనాగమునగల్గు ఆనందమిందు
పూనివర్ణింపగా బోలదావంత
రేయివేళలను పండ్రెండుగంటలకు
గాయకయీధ్వని ప్రభవించినంత
గంటలురెండప్డు గడచునందాక
ఘంటమ్రోగినరీతి ఘననాదముండు
సంతతమాయమై అన్యనాదములు
వింతగానెంతేని విన్పించుచుండు
అనుదినమ్మునరాత్రి యానాదమెలమి

వినవచ్చునేగాని వినరాదుపగలు
వినవచ్చిననుసుంత వినిపించునేగాని
ఘనముగా వినరాదు గావునమీరు
యీవిశేషములెల్ల యెఱుగంగనున్న
జీవ బ్రహ్మైక్యమ్ము చే దెలియుండు
కష్టమంచునుదలంపకయె యోగమ్ము
నిష్ఠతోగావింప నేర్చినంగాని
యీనాదమహిమమ్ము నెఱుగంగవచ్చు
లేసి దేఫలమెన్న లేనెలేదరయ
పరమాత్మతన సమీపమ్ముకు జేరు
తరుణమ్మునతొలి నిద్రానిపంపు
యీవిశేషములెల్ల యెఱుగంగనున్న
జీవబ్రహ్మైక్యమ్ముచే దెలియుండు.



# శ్రీరంగనాధుని రహస్యార్థము.



శ్రీరంగమనుదివ్య క్షేత్రమ్మునందు
శ్రీరంగనాథుడౌ శ్రీరమేశుండు
ఐదువాయువులనే ఐదుశిరముల
దౌ దర్వీకరముగ అమరించి దాని
పొగరు సర్వమ్మును పొలియింపజేసి
తగశాంతము వహించి దానిశిరముల

బాగైనశయ్యగా వరలంగజేసి
యోగనిద్రను పోవు చున్నాడుగనుడు
అదియె శ్రీరంగపు అంతరార్థమ్ము
ఇదియెగాకుండను నీదేవళమున
కంతరార్థముకద్దు అద్దానివినుఁడు
యెంతేని ముఖ్యార్థ మిందుఁగోనిమిడె
ఘోరమూలాధార స్వాధిష్టయు మణి
పూరకనాహత ములునువిశుద్ధ
మంతయాజ్ఞేయమ్ము లారుచక్రములు
అంతట దేహమ్ము నంటున యుంట
శ్రీరంగముననున్న శేముషీధనులు
ఆరుచక్రమ్ములే యాఱు ప్రహరులు
కరణిఁకట్టించిరి ఘనయోజతోడ
మరియుసహస్రార మనుసప్తచక్ర
మరయగా మనలోనె అలరుచుండునుగ
వరలగా నదియెన్న బ్రహ్మకపాల
మద్దానిలోపల యలపరమాత్మ
తద్దయునిల్చియు తగవెల్గుచుండు
దీనినిప్రజలకు తెల్పుటకొరకు
మానుగప్రహరీలు మరియేడునుండ
అలసప్తప్రహరీని అంచితమగుచు
అలరుమూలస్థాన మందు శ్రీరంగ
నాథుండు నిల్చియున్నాడగయంచు
బోధింపసల్పిరి పూర్వీకులఁటుల

ఇటుల శ్రీరంగమం దెలమితోడుతను
పటుగతి శేషాహిపై శయనించి
శ్రీరంగనాథుండు చెప్పనుప్రజకు
నీరీతియంచని యెంచుడుమదుల
నరులార శ్రీరంగ నాథుండ నేను
వర శేషశాయినై వరలితిననుచు
కాదెనన్నిట్టుల కాంచవచ్చెదరు
నా దేహమందు నున్నట్టియామైదు
ప్రాణవాయువులకు బలిసియున్నట్టి
ప్రాణమి నెంతయు పూర్తిగ జంప
అనయంబువానితో ననువర్తియైన
మనసనెవాయువు మ్రిందుచుండెడిని
ఆమాడ్కిగా వాయు వాంశతగన్న
య్యామననుపొగరు యెపుడుచచ్చెడినా
అపుడెయోగ సుషుప్తి నందంగవచ్చు
విపులమహాభావంబు విశేషమ్ముజేయ
పౌరయంచుమనట్లు ఆది శేషుపయి
శ్రీరంగనాథుండు చెలగిపరుండె
పంచప్రాణములందు ప్రాణవాయువయె
అంచితంబుగముఖ్యమైనందువలన
ఆవాయువునె శేషు నంతరశిరము
గావించి రెండుప్రక్కలయందు తక్క
వాయువుల్ శిరముల వైఖరిజేసి
బాయక విపులమహా పాషాణరూపు

గావించిరే కాని గాలించిచూడ
యీవసుధశిరముతే నుండునట్టి
భుజగంబు లెచ్చోట బుట్టంగఁబోవు
నిజమురహస్యంబు నేనిట్లుదెల్ప
తెలిపిరిపెద్దలు దేవురూపములు
పలువిధమ్ములనుంట పాషాణముగను
జేసి దేవాస్థాన సీమలయందు
వాసిగనుప్రతిష్ఠ వాటించినారు
ఒకవిగ్రహమ్మున కొక్కరూపమును
నొకయంతరార్థమ్ము నుండియుండునుగ
అందులోకొన్నింటి యంతరార్థములు
పొందుగానెఱుగంగ బుద్ధిలోయున్న
బాగుగావల జీవబ్రహ్మైక్యరాజ
యోగసారామృత మొక్కింతగనుము.



# శ్రీమన్నారాయణమూర్తి నాభియందు బ్రహ్మదేవు డుద్భవించుట.



జీవిమేదైనను క్షితిపైన జన్మ
నావిర్భమందంగ నరయంగమనసె
కారణమైయొప్పు గాదె తలంప

వేరైన మనసను యీతలంపులను
గరిమనునాశమ్ము గావింపనేర్చ
అరచేతమోక్షమ్ము నందునుమ్మతడు
తలపులుజన్మించు తావుతానెరిగి
తలపులుజన్మించు దారిలేకుండ
గావింపజాలు ప్రజ్ఞాశాలియైన
భావించనాతడే బ్రహ్మణ్యుడరయ
కాన తలంపులు కలుగనుంకించ
వానిని తొలుతనే వారింపవలయు
తలపులుప్రభవించు తావదెందనిన
నళినాసనుండెందు ననుబుట్టినాడో
నచ్చోటనేపుట్టు నన్నికోరికలు
ఇచ్చలో నీయూహ లేలపుట్టెడినో
అద్దానిగల రహస్యార్థమ్ము లిపుడు
తద్దయు వివరింతు తగమీరువినుడు
ప్రళయాంతమునను ప్రపంచమ్ముసృష్టి
సలుపగా పరమేష్ఠి జాణయౌననుచు
ఆదినారాయణు డాతనిదలచ
ప్రాదుర్భవించె నారాయణునాభీ
నారాయణునినిజ నాభియందునను
సారసాసనుడెట్లు జన్మించినదియు
బాగుగ (శ్రీ) జీవబ్రహ్మైక్య రాజ
యోగసారామృత మొప్పగగనుడి
ఏడువందల డెబ్బది యేడవపుటను

క్రోడీకరించియు కూర్చియుండెనుగ
కానమానవులకు కల్గుతలంపుల
కానాభిధేః మూలమని తెలియుండు
సృష్టినిసేయంగ శ్రీధరుండట్లు
సృష్టనుపిలువంగ సత్వరమ్మగను
హరినాభిజన్మించి నట్టివిశేష
మెరిగింపగుడులంమ నీరీతిగానె
మనపూర్వులైనట్టి మహనీయులెల్ల
ఘనవిగ్రహములట్లు గావించిరోగిని
యావిశేషంబెల్ల నెరుగంగనున్న
జీవ బ్రహ్మైక్యమ్ము చే దెలియుండు.

# తలంపులనెడి మనస్సునకు కెరటముల (అలలను) దృష్టాంతముగా చూపుట.

వాయుసహాయమ్ము వలనయాయగ్ని
యేయేవిధముజ్వాల నెసగంగగలదో
ఆరీతినేశ్వాస మనెడు వాయువున
కోరికలనియెడి గొప్పైనమనసు
పుట్టియు నా తలంపులనెడి మనసు

వట్టిపోవునుశ్వాస వాయువ్రంగలసి
మనసుయు శ్వాసయు మరిబాయకుండ
అనయమ్మువర్తించు సద్దానివలన
మనసునిల్చినదేని మరుక్షణమ్ముననె
గొనకొనిశ్వాసయుం గూడయాడదుగ
మనసుస్వభావమ్ము మరియేమియనగ
అనయము తలుపుల నందుచుండుటయె
అట్టిదామానసం బబ్ధియందునను
బుట్టెడియలలతో పోల్చియీాక్రింద
దృష్టాంతముగమేము తెలియపల్కెదము
స్పష్టమానద్దాన సర్వమ్ముతమకు
అనఘ. సంద్రపురీతి నదియెట్టిదనగ
వినుమయ్యవాయువు వీవనియపుడు
కొలనిలో జలమెట్లు కొంచెమేనియును
చలియింపదోయట్లె సంద్రమ్ముగూడ
చలనమ్మునందదు సత్యమీామాట
నిలచియుండగనైన నీరధియందు
సతము తరంగముల్ జనియించివేగ
పతితమాచుండు పత్రిని మేషమున
ఈరీతినుండుట కేమిహేతువన
వారిధిగొండలు వనభూజములును
పగృహాదులుగాని యేమియులేక
బాగుగనెచ్చోట పరికించిగనిన
నొకయడ్డులేకుంట నుదధిపైసతము

అకలంక మైయొప్పి ఆనందమగుచు
వీచుచుండునుగాలి విపులమ్ముగాను
వీచికలంతట వేసవేలుగను
కదలకుండెడునబ్ధి గాలితాకునను
నుదయించి పైపైకి యుబుకుచునుండు
అటులనుండెడునట్టి అలలయందునను
చిటిచిటిబుడగలు చిన్నితుంపరలు
నురగలు మొదలుగా నుద్భవించుచును
త్వరితమ్ముగా నవి తరగలయందు
మరలలీనంబౌచు మటుమాయమందు
తరగలు లీనమౌ తగవారియందు
కదలకుండినయట్టి కడలియేరీతి
కదలియు నలలుగా గాలిచేలేచి
బుడగలు తుంపరల్ బుగ్గలు పెక్కు
పొడమెనో యారీతి పోల్చిచూడంగ
మొదలుబొడ్డునపుట్టి ముక్కుద్వారముల
వదలక వచ్చుచు శ్వాసయన్ గాలి
సరగునబయటికి జనుదెంచి వెంట
హరియించుశ్వాసయు నరయనొక్కొకటి
జడధియందు తరంగ జాలమ్ములోన
బుడగలు తుంపరల్ బుగ్గలుపుట్టి
జాలమించుకలేక క్షణములోపలనె
లీలగా అలలలో లీనమైనట్లు
శ్వాసయు బయటికి జనుదెంచునపుడు

బైసిమాలినయట్టి భావముల్ చాల
నాభిప్రదేశమ్మునను శ్వాసతోడ
ప్రాభవంబందియు బయలుకువచ్చి
గణియింప తృటిమాత్రి కాలముండకయె
క్షణములోపల వినాశనమునుబొందు
మారుతరూపిపైయె మసలుమానసము
వారకబంధించు పద్ధతివినుడు
ఒక్కవల్మీకమ్ము నుండి సర్పమ్ము
చక్కగాబయటకు జనుదెంచుతరిని
అచ్చోట నెవరేని ఆగియుండినను
వచ్చినమనుజుని వైఖరియెల్ల
కలుగులోపలనుండి కడునేర్పుతోడ
తలను నిక్కించియు తాఁ బరీక్షించు
నాగమ్ములకుచెవుల్ నయనయుగ్మమ్ము
బాగుగానేకమై వరలుచునుండు
పురుషునిసర్పమ్ము పుట్టదాపునను
అరసినవెంటనే అరుగులోపలికి
మఱికొంతవేళకు మరలవచ్చియును
పురుషుడుండినయేని పుట్టలోజొచ్చు
పురుషుడులేకున్న భుజగమందుండి
త్వరితమ్ముగాతాను బైటకుజనును
ఆవిధమ్ముగమీర లాత్మలోపలను
భావింపుడీనాభి వల్మీకమనియు
శ్వాసదలంపుడీ సర్పమ్మటంచు

భాసుర జీవుండు భావించిచూడ
మానసం బేయంచు మరువక యెపుడు
జ్ఞానవంతులరయు జగతిలోపలను
తక్కినవిషయముల్ తగుశ్రద్ధతోడ
గ్రక్కున రాజయోగంపు సారమను
పొత్తమామూలమ్ము పొందుగాచూచి
చిత్తమ్ములోతృప్తి చెందుడీబుధులు.



# మనస్సనెడి మర్కటముయొక్క రహస్యార్థము.

మ్రానుపై కెక్కిన మర్కటంబెట్లు
ఆనందమున శాఖ లందెల్ల నెగిరి
పలుగంతులను వైచు భావమ్ముగలదో
తలపంగ నాలీల దైవమ్ముకూడ
తనువటంచనియెడి ధాత్రీజమందు
మనమనుకోతిని మసలంగజేసె
మానసంబనునట్టి మర్కటంబందు
తానొనర్చెడి పనుల్ తగవివరింతు
మానసంబనియెడు మర్కటమెన్న
ఆనందమునుబొంది యాత్మీయసతిని

ముద్దుమాటలచేత మోదముంగూర్చి
హద్దుమీరిచరించు నాక్షణమందె
పద్దుకురానట్టి పల్కులుపల్కి
గద్దించుమరియును కౌర్యంబుబూని
పుత్రులమీదను పుత్రికలందు
పౌత్రులమిత్రుల బంధుగులందు
ఒకశాఖనుండి వేఱొక శాఖపైకి
ఒకనిమేషంబేని యూరకుండకయె
చపలత సతతమ్ము చరించునట్టి
కపిరీతి హృదయమ్ము కడుచంచలతను
క్షణముప్రేమించియు క్షణముకోపించు
గనలేదునిలుకడ గడియసేపైన
వ్యవహారముల న్యాయవ్యాపారములను
అవలోకనమొనర్చు నాసక్తితోడ
ధనధాన్యములయందు తనభూములందు
ఘనవాహనములందు కాంతలయందు
నాగవాసములందు నాట్యములందు
రాగమ్ములం దనురాగమ్మునంది
త్రుటికాలమేనియు స్థిరబుద్ధిలేక
తటుకునను విషయాంతరమున కరిగి
అలసటయనినైన నాత్మనెంచకయె
కలలురాని సుషుప్తి కాలమ్ముతప్ప
సర్వకాలములందు చపలతదాల్చి
పరిగెడుమనమను వానరమెపుడు

అటులపర్విడుచున్న యట్టిమనంబు
ఘటియింపగావలె కదలకుండగను
అటులొనర్చితిమేని యాత్మయందునను
తటుకునలీనమౌ తద్దయుమనము
ప్రకటిత శ్రీజీవబ్రహ్మైక్యమందు
సుకరమ్ముగా దీని శోధింపవచ్చు.



# శ్వాస హంసమంత్రమును జపముచేయుట.



సకలజీవులలోన సర్వకాలముల
ప్రకటితమౌనట్టి శ్వాస వాయువును
అవనిపండితులెల్ల హంసయన్పేర
ప్రవిమలబుద్ధితో పల్కుచుండెదరు
నీలమేఘముబోలు నెమ్మేనిచాయ
నాలుగుభుజములు నళిననేత్రములు
ధరియించివచ్చిన దైత్యారియైన
మురువుగ నాలుగు భుజములతోడ
ధవళిమనొప్పారు తనుకాంతితోడ
శివుడవతారమ్ము జేకొన్నవాని
తానుశరీరమ్ము దాల్చియుండుటను

మానక నాసికా మార్గమ్మునందు
మును తెల్పియున్నట్టి ముఖ్యమౌ "హంస"
కనవచ్చెనయ్యావి కల్గకయున్న
ఆతండుహరుడైన హరియైననేమి
ప్రీతభావముతోడ వీక్షింతురతని
ఈహంసయేసుమ్మి యిల గణనాథు
డీహంసయేసుమ్మి యెరుగవిష్ణువును
యీహంసరూపుడే యెన్నగా శివుడు
యీహంసరూపుడే నెంచగా నాత్మ
మరియునీతడెచూవె మనుజులకెల్ల
గురువుగావర్తిల్లు కూర్పజ్ఞానమ్ము
సకలజంతువులందు చరియించునితడు
అకలంకమౌనట్టి యాత్మరూపమున
స్వప్రకాశుండును సాక్షిభూతుండు
సుప్రభావుండునౌ జ్యోతియీతండ
ఈవిశేషములెల్ల నెఱుగనెంచినను
జీవబ్రహ్మైక్యమ్ముచే దెలియుండు.



# దేవాలయముయొక్క రహస్యార్థము.



లోకమ్మునన్ జనలోకమ్మునం ద
నేకుల కణుమాత్రమీశ్వరభక్తి
యనునది యేలేక యనవరతమ్ము
ఘనభవాబ్ధినిమున్గి కాలమ్ము పుచ్చి
యీషణత్రయముల నీదులాడుచును
వేషభాషలయందె వేడుకజూపి
అర్థార్థులై జీవ మారడి జేసి
వ్యర్థమౌచుండిరి పామరజనులు
అట్టివారలు ముక్తి నందెడుకొఱకు
కట్టిరి పూర్వికుల్ కడు దేవళముల
శివకేశవాదులా జేజేల కెల్ల
వివిధరీతులతోడ విపులమౌ భక్తి
దేవళమ్మున కేగు స్త్రీపురుషాళి
దైవమ్ము కల్పింప తగు భక్తితోడ
నారికేళఫలమ్ము నయమొప్పగాను
హారతికర్పూర మర్చకునకిడ
నారికేళఫలమ్ము నైవేద్యమొసగి
హారతి వెలిగించు; నర్థులంతటను
చేతులుజోడించి చేతమ్ములలర
ప్రీతిసద్గతివారు వేడుకొందురుగ

"పుత్రసంతతిలేక పొగులుచున్నాడ
పాత్రుడీతండని పాలించినన్ను
సంతానమునొసంగ జాలితివేని
సంతోషమున నీకు స్వర్ణకిరీట
మును తెచ్చియర్పింతు భూరికృపాళు"
వనియొక్కడార్తుడై యాత్మభజించు
వేరొక్కకొండఱు వేడెదరిటుల
"సారసౌశీల్యయౌ సత్కన్యనొండు
సౌందర్యవతి దెచ్చి సల్పు పెండిలిని
అందమౌపాదుకల్ అయ్య! నీకిత్తు
నేను బిద్యేప్యాసు నీయేటనైన
మానకయురమున మణులతోగూర్చి
హారమొక్కటినీకు అర్పింపగలను
వారకనాభర్త వ్యాధియుంబోవ
నాకుగల్గినయట్టి నగలెల్ల స్వామి!
నీకుముడుపునిత్తు నిక్కమీమాట
అనియిట్లువారెల్ల రాయీశుజూచి
వినతులై వరముల వేడుచుండెదరు
ఆరాతివిగ్రహంబైన ఈశ్వరుడు
వారలతోనిట్లు పల్కనువినుడు
"మానవోత్తములార మనుపగా మిమ్ము
నేనిందునిలచితి నిక్కమీమాట
కానిమీరలునన్ను కాంక్షింపదగిన
జ్ఞానమ్మునడుగక స్వల్పమైనదియు

అనత్రికాలమునందు యంతరించునది
ఘనమైనదనుభాగ్యంబు కాంక్షింతురకట
పారలుహస్తముల్ మేళవించియును
కోరెడికోర్కెలో గూఢార్థమిపుడు
తెలియజెప్పెదమీకు తేటగాననుచు
పలుకంగదొడగెను భగవానుడిటుల
"కరములరెంటిని కలుపుభావమ్ము
మెరుగుడు రేమీర లేమియంచనిన
జీవాత్మపరమాత్మ జేర్చుమంచనెడి
భావమ్ముజూపుటే బాహువుల్ గూర్ప;
అరనిమేషములోన వ్యర్థమ్ము జెందు
వరములుకోరిన ఫలితమేముండు?
మీరుకోరినవాని మించువరమ్ము
లారయమీకిత్తు" ననుచు శ్రీపార్థ
సారథి పెరుమాళ్ళు సత్కృపపల్కు
తీరునువివరింతు తేటతెల్లముగ
"ఇదిగో! కనుండు నా యెడమహస్తమ్ము
వదలక నా వామపాదమ్ముజూపు
కనుక మీదృష్టిని కదలంగనీక
మునుకొని మత్పాదాంబురుహమ్ములందె
అనయమువీక్షించు చవ్వానిమఱచి
మనమునూరకయుంచే మార్గమ్ము నచ్చి
యేతలంపులు లేక యెల్లవేళలను
అతతాభ్యాసమ్ము నాచరించండి

పార్థసారథియను ప్రఖ్యాతిగలిగి
వర్థిల్లువేల్పునై వదలక సతము
యోగసమాధిలో నుండియోజింప
వాగతీతానంద వార్ధిలో మునిగి
నిలచియుంటినియిట్లు నిలచిననన్ను
తిలకించవచ్చెడి స్త్రీపురుషాళి
కేనుశిలారూప వృత్తితోనుంట
నానోటపల్కుట నయముగాకుంట
నాకుడిహస్త సంజ్ఞనుమీకుజూపి
వాకొందునంచని వాక్రుచ్చెనిటుల
"ఏనుశిలారూప మెట్లందినానో
బూనికమీమనమ్ముల నట్లెశిలగ
గావింపవలయును గావింతురేని
జీవస్వరూపులై చెలువొందుమిమ్ము
నాలోననైక్య మొనర్చుకొనేర్తు
నాలోననైక్యమై నందుకు మిగుల
సంతోషముననోట శంఖంబునునిచి
వింతగాపూరింతు విను" డంచు తెల్పు
యీవిధమ్మును మన కెఱుగంగజేయ
గా వాంఛ స్వామివిగ్రహమును పూర్వ
లోకహస్తమునశంఖ మొకహస్తమందు
ప్రకటితమ్ముగను చక్రమ్ముఘటించి
సృష్టించియుండిరి చిత్తమందెంచే
స్పష్టమాబాగుగ భావమ్ములెల్ల

పరమాత్మయైయొప్పు పరమశివుండు
ధరపైనవతరించి తనహస్తమునను
అలఢమరుకమును హరిణమ్ముదాల్చి
తెలిపినయర్థమ్ము తేటతెల్లముగ
బాగుగ (శ్రీజీవబ్రహ్మైక్యరాజ
యోగసారమ్మున నొప్పుగానైదు
వందల డెబ్బదినాల్గవపుట పఠింప
సందేహమునుదీరు సత్యమ్ముగాను
మరియొక్కతూరి యాపరమాత్మతాను
నరయంగ వేలుపై నటరాజుగాగ
భువిచిదంబరమన్న పుణ్యభూస్థలిని
నవతరించురహస్య మైదునూర్లనెను
బది యారవపుటను పఠియింతురేని
విదితమౌమనసుకు విశదమ్ముగాను
అవలనాతడె శంకరాచార్యుడగుచు
నవతరించినరహస్యార్థమ్మునాగు
వందలనలుబది పయినెన్మిదిపుట
పొందుగసర్వమ్ము బోధింపబడియె
ఆపరమాత్మ మహావిష్ణువగుచు
ప్రాపుగాశేషుని పై బవ్వళించి
అవతరించిన రహస్యార్థమ్మునెల్ల
ప్రవిమల నెనిమిదివందల యేబ
దారవపుటగాంచి యుండుపఠింప
నారయగాచ్చు నంచితమ్ముగను

మరియొక్కతూరి యా పరమాత్మ తాను
అరయవిష్ణువుగాఁగ నవతరించియును
తననాభితలమున ధాతజన్మింప
గను జేసియుండిన క్రమము నెన్మిదియు
వందలయఱువది పయినాల్గవపుట
యందగాంచగనౌను; యా పరమాత్మ
ధరణిపై విష్ణ్వావతారంబుగాంచి
కరచతుష్టయమును గన్పింపజేయు
ననఘుమా యా రహస్యార్థమ్ము సర్వ
మును తొమ్మిదినూర్ల మూఁడవపుటను
కనిపరించిన తేటగా తోచుమీకు
మనుజులెల్లరునిట్టి మహితార్థములను
తెలిసివర్తించ యీ తీరుగా నెన్నో
శిల్పలవిగ్రహముల జేయించె పూర్వ
లీవిశేషములెల్ల నెఱుగంగదలప
జీవబ్రహ్మైక్యమ్ముచే దెలియుండు.



# బంధమోక్షములకు మనస్సే కారణము.



ఇలలోనమానవు లెల్లరిమనసు
పలుదెఱంగులుగాగ వర్తించుచుండు
పరిశుద్ధవంతమై వరలుకొందరికి
పరిశుద్ధహీనమై బరగుకొందరికి
లేశమేనిఫలమ్ము లేకుండునట్టి
ఆశలెల్లనువీడి ఆత్మస్వరూప
మందులయమ్ము జేయగజాలుమనసు
నందురుపరిశుద్ధ మైనట్టిదనుచు
ధనధాన్యములపుత్ర దారాదులందు
అనుపమవస్తు వాహనములయందు
మదినిగనుల్కొల్పి మమకారమూని
అదినాదియిదినాది యనుచుబంధముల
చిక్కిదుఃఖమ్ముల చేతనిత్యమ్ము
స్రుక్కునెడ నపరిశుద్ధమైనట్టి
మనసనియందురీ మనసునుగూర్చి
వినుడింకవివరింతు విశదమ్ముగాగ
కనకమొక్కటియయ్యు కంకణమనుచు
ఘనకిరీటమని మకరకుండలమని
నానావిధమ్ముల నామరూపముల
బూనెనోయటులె యీభూమిమానవుల

మనము నానావిధమార్గమ్ములందు
చేనికోర్కెలెన్నియో సతమువాంఛించి
అనుభవింపగ నెంచే నద్దానతిరిగి
జననముల్ మరణముల్ చాలకల్గెడిని
వారలుమనసులో వాంఛించేనటుల
ధారుణిజన్మించే తథ్యమ్ముగాను
చరరూపకంబగు సంసారమనెడి
తరువుకుబీజమై తగుమానసంబు;
పాపపుణ్యమ్ముల వగుసనందందు
పారిపుగా సర్వదా పరిభవించేమనసు
మనసుకువేరుగా మనకుశత్రువులు
కనుగొనలేరంచు కడునమ్ముకొనుడు
పసితనంబనియు యౌవనకాలమనియు
ముసలితనంబను మూడవస్థలను
అనుభవించకజన్మ లమితమ్ముగాంచి
మనుజులదుఃఖ నిమగ్నులజేయు
మనమెకాలునిబాధ మరిందింపజేయు
మనమెతలంచేట మఱచేటజేయు
మనమెజీవుడుకాగ మరియుజన్మించే
మనమెఘటించేను బంధమ్ములెన్నో
అలబుద్ధిచిత్తమహంకారములకు
దలపమనంబె ప్రధానమైయొప్పు
తగసత్వరాజస తామసములగు
త్రిగుణమ్ములకుపాదు తెలియనీమనమె

అరయజాగ్రత్త స్వప్నావస్థలందు
వెరవరిగానిల్చి విషయమ్ములందు
తలపులుకల్పించి తన్మయత్వమున
చలనమ్ముకల్గించే జాలుటీమనమె
అష్టదిక్పాలుర కలరుద్రులకును
అష్టవసువుల కరయయీమనమె
కారణభూతమై గాత్రిలునిక్కముగ
సారమసార విచారణజేసి
కొంతకాలము జ్ఞానకోవిదుజేయు
కొంతకాలముచాల కుటిలునిజేయు
మంచిదేయని చెడ్డమార్గమేయని గ్ర
హించకేవాంఛించు నెల్లకామ్యములు
దానిచేపనిలేక తద్దయుందిరుగు
శ్వానమట్టులసదా చరియించేచోందు
క్షణములో త్రిజగముల్ చరియింపనేర్చు
నణుమాత్రమైనతా నాయాసపడకె
మనమిటుల్ చరియింప మనుజులకెల్ల
జననమ్ముమరణమ్ము సంభవించెడిని
శారీరమనుగూట సర్వదాయుండు
ఆరయజీవాత్మ యనునట్టిచిలుక
అందులోశయనించి యన్నిశాస్త్రములు
నందరికిసెదెల్పు నత్యద్భుతముగ
తనజన్మకేదియో తగినహేతువును
గనుగొనశక్తిని గాంచేనిమనసు

మరియొక్క పుట్టుకన్ పరిభవించు మరియు
సరిగను జీవాత్మ సాక్ష్యమీయంగ
చిత్తంబనుమనంబు చేకూడికొనియు
క్రొత్తశరీరపు గూటిలోచేర
మనసుజీవాత్మయు మారుతమందు
చేనుచుండులీనమై చెక్కగాకనుడు
మనసునుచిత్తంబు మరియుబుద్ధియును
అనుపమాహంకృతి నంతఃకరణ చ
తుష్టయంబనుచు బుధుల్ పల్కుచుందురు
స్పష్టమ్ముగావాని సందర్భములును
వినుపింతుమీరిప్డు వినుడుశ్రద్ధగను
మనసొకవస్తువున్ స్మరియించ బుద్ధి
అదిమంచి దదిచెడ్డ దనిచెప్పుచుండు
తప్పపరిచిత్తంబు దానినిస్థిరత
గానొనర్చును యహంకారమ్మునంత
వానికర్మానుభవమ్ముగా కోప
కలితుజేసియు నధోగతిపాలుజేయ
కలుగునుజీవాత్మ కదలివేరొక్క
తనువునకనువుగా తానుజన్మించె
గనుకనుమరణము గాంచువారలను
గనిశోకమందంగ కారణంబేమి
మనమునసంతోష మగ్నులై మీరు
యీవిశేషంబెల్ల నెఱుగంగనున్న
జీవబ్రహ్మైక్యమ్ముచే దెలియుండు.

# "సోహం" మంత్రముయొక్క రహస్యార్థము.



విమశ్వాసయజ్ఞోపవీతమటంచు
అడరనూలంచును హంసయటంచు
పాదమటంచును ప్రాణంబటంచు
శోధింపగా బ్రహ్మసూత్రమటంచు
ఊపిరియంచనుచుండ్రు ధీమతులు
యీపేర్లనొప్పెడి యీశ్వాసనాభి
తలమునజన్మించి తాముక్కురంధ్ర
ములనుండి వెలికిని పోవుచుండునుగ
బుడగలుతుంపరల్ బుగ్గలునీట
పొడమివెంటనె రిత్తపోవునప్పగిది
ఎందుకుకోఅగాని యిచ్ఛలెన్నని
పొందుగాశ్వాసలో పుట్టినశించు
యీరీతికోఅగాని యిచ్ఛలేగాక
సారమైముఖ్యావసరమైనవియును
శ్వాసలోనేపుట్టు శ్వాసలోపలికె
వాసిగా హంసోహ వాక్యంబుదలప
ఆశ్వాసలో సోహ మనుమంత్రజపమ
శాశ్వతమ్ముగజేయు సరిగదినమ్ము
ఇరువదియొక్క వేయింటిమీద

అరయగ నారు నూర్లౌ శ్వాసలగును
పరికటిత (శ్రీ) జీవబ్రహ్మైక్యమందు
అకలంకముగ జూచి యందునున్నట్టి
సోహంబ నెడిమంత్ర సూక్ష్మముల్ రెండు
నూహించి శ్వాసతో నొప్పుగా జేర్చి
జపియించుచున్నచో సర్వదా మిగుల
చపలత వెలుపల చరియించుమనసు
మంత్రమ్ము శ్వాసల మధ్యలో జిక్కి
మాంత్రికు చేతిలో ఫణియున్నరీతి
విడివడి చరియింప వీలు లేకుంట
అడగిమనుగగు తనంతట తానె
అనయమ్ము నెటులేని అష్టదిక్కులకు
ఘనముగ పర్విత్తఁగల్గుమనంబు
అలబ్రహ్మసూత్రమ్ము ననునట్టినూలు
వలనను శ్వాసచే బంధించినంత
మనసట సోహమ్ము మంత్రమ్ము జపము
నొనరించు నెటులేని యొకకొంతసేపు
తరువాత, నిద్రించు తరిని బాలుండు
కరముననున్నట్టి కాయనువిడుచు
పగిదిని సోహమ్ము మంత్రమ్ము విడిచి
తగసుషుప్తి వహించు తనువెఱుంగకయె
అదియె హంసోహ రహస్యార్థమరయ
అదియె యగు శివోహ మనికూడయనగ
అలశివోహమ్మన నర్థమేమనిన

అలికనేత్రుఁడనేనె యైశిరఁజేనుట
అనయమ్ముఁ దాను శివోహంశివోహ
మనుమాత్రము నె తాను యానోక్కోశివుడు
సోహంబనంగనే నగుదుబ్రహ్మను శి
వోహంబనంగనే నగుదుశివుండ
నని యెడినోకయర్థ మరయయీరెండు
ఘనముగాబోధించు గావునవిూరు
ఈవిశేషార్థమ్ము తెలుగంగనున్న
జీవబ్రహ్మైక్యమ్ముచే దెలియుండు.



# పరమశివుఁడు రాజునకు ఉపదేశించుట.



జగతిజనులకెల్ల జన్మజన్మముల
నోగినోనరించు పుణ్యోదయమ్ము
వలనయీశ్వరభక్తి పరిభవించుదాన
నిలుకడయాధ్యాన నిష్ఠయుడుదురు
ఆనిష్ఠచేయోగ మబ్బునుదాన
జ్ఞానమామోక్షంబు సంసిద్ధిగాంత్రు
యీపై విధిని మోక్ష మెలమిగాంచంగ
సోపానముల్ నాల్గు జూపెట్టబడియె
పుణ్యమ్ములనుభేదములు కూడ కల వ
గణ్యమైవానిని కడుశ్రద్ధవినుము

చలివేంద్రియు తటాక సత్రముల్ నూతు
లాలయకనిర్మింతు రొకకొంతమంది
దేవాలయమ్ముప్రతిష్ఠలు తీర్థ
సేవలుకొందఱు సేయుచునుందు
రిదిచేసియుంటిని యింకనుగూడ
నదిచేయజాలెద ననుచువారొనిన
మరుసటిపుట్టువ మహనీయగతుల
సిరిచిరాయువులొంది చెల్వొందగలరు
కానిదానిని కామ్యకర్మంబటంద్రు
దానిచేజన్మముల్ తరుచుగాగల్గి
ఈశ్వరభక్తి జనింపగాబోదు
శాశ్వతానంద మోక్షముగాంచబడదు
పరమేశ్వరునిభక్తి ప్రభవించుటకును
వరుసగ(శ్రీ)జీవబ్రహ్మైక్యరాజ
యోగసారమ్మున నున్నసంగతుల
బాగుగప్రకటింతు పఠియింపుడీరు
తానొనర్చెడిసుకృతపుకార్యములకు
నానందదుఃఖంబు లందంగబోక
యెట్టివాంఛయు వహింపగాబోక
గట్టిగానిష్కార్య కర్మరుండగుచు
యీశ్వరప్రీతిగానే యొనరింప
యీశ్వరభక్తిలో నీపుణ్యమహిమ
లీనమైయీరీతి లేశలేశమ్ము
జానుగారాబోవు జన్మజన్మముల

ఈశ్వరభక్తితా వృద్ధినిగని త
దీశ్వరభక్తిపై యిచ్ఛనశించి
తనుపరిమెట్టగు ధ్యానంపునిష్ఠ
కుదిరియు నద్ధాన కొంతకాలంబు
నిష్కామ్యకర్ముఁడై నిఖిలపుణ్యములు
నిష్కళంకాత్ముతో నిరతమ్ము జేయ
ఆపుణ్యమహిమమ్ము నాధ్యాననిష్ఠ
పాృపుగ నభివృద్ధి బడయంగ జేసి
ధ్యాననిష్ఠనుబుద్ధి తరిలంగ జేసి
దానిపై మెట్టయి దనరుయోగమ్ము
నందున జేర్చియు నటునిల్చియుండి
పొందుగా నిష్కామ్యబుద్ధితోడుతను
పున్నెముల్ జేయ నాపుణ్యంపుమహిమ
తిన్నగాయోగ మందేబుద్ధిపండి
అటుపయిమిగుల బ్రహ్మానంద మొసగి
పటుతరశక్తియా ప్రబలుజ్ఞానమును
పొందఁచేనున్నాఁడు మోక్షమానదియె
సందేహమావంత జనదువహింప;
యోగసంసిద్ధుఁడై యొప్పెడునట్టి
యోగీంద్రునకు కర్మమున్న శేషించి
అనుభవించుటకుగా నాకర్మఫలము
జనియింపగావలె జగతిలోపలను
ఇందుకుదృష్టాంత మిాగ్రంథకర్త
ముందుజెప్పవినుండు మోదమ్ముతోడ

మునుపాకపురుషుండు భువినిజన్మించి
ఘనయోగసిద్ధిని గాంచియుండియును
తనకర్మశేషమ్ము తరుగకయుంట
అనుభవించుటకునై యాయోగదేహ
మునువీడిరాజుగా బుట్టిపదేండ్లు
జనులనుపాలించి జ్ఞానమీశ్వరుని
వలననుబడసియు ప్రారబ్ధముడుప
వలసియుంటనుతాను వదలిదేహమ్ము
పుట్టుకగాంచియు భూభర్తయుంట
పట్టాభిషేకుడై ప్రజలనందఱను
తొమ్మిదిన్నరయేండ్లు గోపమ్ములేక
నెమ్మదిపాలించె నేర్పుమీరగను
భూపతి యుపదేశమునుపొందుతరి స
మీపించియార్నెలల్ మితిమాత్రముంట
ఆక్షితీశ్వరు హృదయాబ్జమ్మునందు
సాక్షిభూతుండౌచు చరియించునాత్మ
కర్మానుసారియై కల్గుబుద్ధియను
ధర్మమ్మురీతిగా ధాత్రీశునకును
పలుకబోయెడురీతి భావజాలమ్ము
పొలుపొందగా తాను పుట్టింపదొడగె
"ఇంచుమించు బదేడు లేలితిభూమి
యెంచిచూచినక్రొత్త యెఱుగరాదాయె
చేసినపనులనే చేయుటలాయె
వీసమ్ము సుఖమిందు వెదకినలేదు

## పరమశివుండు రాజునకు నుపదేశించుట.

"మనసునిల్పుమటన్న మాటయానిజము
కానరింతునటులింక నుత్సాహినగుచు"
అనిదలంచి యాభూపుఁడాక్షణమ్ముననె
కనుమోడ్చిమతి నిల్పికదలకనిల్చె
శ్రీభునినై ఖరినెల్ల పరికించుచుండి
సభలోనసచివులు సామంతనృపులు
పలువురుసభ్యులు పండితవరులు
బలియింపకుండిరి శ్రద్ధతోఁడుతను
అప్పుడుమధ్యాహ్నవేళాట నందరును
తప్పనిసరిగాగ తమగేహములకు
ఆకలిదప్పుల కాగగాలేక
భూకాంతువిడనాడి పోయిరితుదకు
మరలవెంటనె రాజమండపమ్మునకు
పురిగల్గుప్రజలెల్ల పోయికన్గొనిరి
మానవనాథుని మాపగుదనుక
గానియాభూపతి కనువిప్పఁడాయె
ప్రొద్దుపోవుటచేత పురివారలెల్ల
నిద్దురబాధచే నిలువగాలేక
తరలిపోయిరి చూనె తమగేహములకు
దొరుగ మీంయమ్ముతం బెన్నడంచనుచు
దొనిమిదిదివసంబు లీరీతిగాను
మనుజేశ్వరుడుచూచి మాటాడకుంట
సచివు లుద్యోగులు స్వాంతమ్మునందు
రచియించుకట్టు లీరాజ్యపాలనము

అనుకూలముగనాకు నతడుపదేశ
మునుసేయలేనిచో పొందునుశిక్ష''
అచ్చోటలందుండు నట్టిపండితులు
హెచ్చుగశిష్యుల నేలుదేశికులు
విచ్చిలేఖలనంత వీక్షించితాము
ఇచ్చునేరాజ్యార్ధ మేబుధుండైన
వచ్చినచెడురీతి వానికిదయను
యిచ్చిన నుపదేశ మెంతవిరిడియొ
అనియిట్టులెల్లిదం బాడి యానృపుని
జననెంచి తమలో ప్రసంగించిరిటుల
చూచితిగాలేఖ సుజ్ఞావధాని
నాచేవచూపింతు నరనాధుకడను
మంత్రమ్ములందెల్ల మహిమకలట్టి
మంత్రమ్ము శ్రీరామ మంత్రమ్ము నేర్తు
అదిరాజునకుజెప్పి యర్ధరాజ్యంబు
ముదమునగొనివత్తు పోయెదనిపుడ
అనిపల్కియొకడేగ నారాజుపురికి
జనపతిజాబును చదివివేగొకడు
ఇట్టివెఱ్ఱులుగూడ యీపృథ్విలోన
పుట్టుచునుందురే బుద్ధిజాడ్యమున
ప్రియశిష్యసంఖ్యమ్ము వెనువెంటరాగ
రయమున నేనేగి రాజన్యుకడకు
అరుదైనసోహమం చనియెడునట్టి
వరమంత్రమునుజెప్పి ప్రభువొసంగగను

అర్ధరాజ్యమ్మొసంగెద నని యోగివేగ
అర్ధార్థులై యిట్లు లగణితమ్ముగను
రాదొడంగిరి బుధుల్ రాజేంద్రుపురికి
యేదో సమోయుంట నీరీతి తామ
ఆరాజుచే శిక్ష లందున్నట్లుగను
వారికి విధికోర్ట వ్రాసియుండుటను
వెనుకజన్మములోన పృథ్వీశుఁ డరయ
ఘనయోగియైయుండి కర్మశేషమున
జననాథుఁడై పుట్ట జాలెనుగాక
మునియోగిజన్మమ్ము బొందకమున్నె
పూనిక తారకమును సోహమాది
మానితంబులునైన మంత్రజాలమ్ము
నెఱిగి సిద్ధియొనర్ప నేర్పున జపము
పరిపక్వమైదాని పైనిమెట్టైన
యోగమ్మునన్ నృపుఁ డుండుటకతన
రాగమందక మంత్రరాజిపై నతఁడు
ధీరుడై మంత్రోపదేశమ్ము తనకు
కోరి సేయఁగ వచ్చి కూర్చున్నజనుల
క్షణమాత్రమున మంత్రశాస్త్రమ్మునందు
తనబుద్ధిచాతుర్య తను జూపి గెల్చి
కక్షనుబూని తా కనికరముడిగి
శిక్షించి వారల చెరసాలనుంచె
మనసునిల్పిన యోగి మంత్రమ్ములందు

ననురాగమునుజూప డణుమాత్రమైన
పలుకులు వేయేల పలు తెరంగులగు
తలపుల నేకాగ్రతను నిల్ప నెఱుగ
బాగుగా శ్రీజీవబ్రహ్మైక్యరాజ
యోగసారమున గురూపదేశముగ
చెప్పియుండినయట్టి శ్రీరామమంత్ర
మొప్పైనసోహమ్ము నుత్సాహియగుచు
జపమనుదినమును సలుపుచురాగ
చపలముడిగిబుద్ధి చక్కగా నిలుచు
శ్రమను నేకాగ్రత సాధించి పిదప
నమనస్కయోగమ్ము నందంగవలయు
మనసునిల్పుటకునై మంత్రజపమ్ము
మునుజెప్పినవిగాని పూన్కిజపింప
వ్యటుమాయమైపోవు మనసుసాధనను
అటువంటిస్థితియె సుమ్మనుపమపదవి
నృపతియై ధరను జన్మించినయోగి
కుపదేశమునుసేయ నొప్పెడివాడు
అలయోగమునకన్న నధికమ్ము నగుచు.
పొలుపారు జ్ఞానమ్ము పొందగావలయు
జరుగనిచోనట్లు జగదీశ్వరుండు
గురురూపమునవచ్చి కూరిమితోడ
జ్ఞానోపదేశమ్ము సలుపగావలయు
కానయీశుడె నేడు కౌతుకమడర
గురువుగ జనుదెంచి క్షోణీశునకును

తిరమగుజ్ఞానోపదేశమ్ముసేయు
యుపదేశమొనరించు నూహతోఁడుతను
చపలురై వచ్చిన శాస్త్రపండితుల
మతిమంతుఁడై క్షణ మాత్రమునందఁ
క్షితిపతిఁ యోడించి చెరసాలకనిపి
తరణికుగ్రింకుట జేసి తా సభవీడి
అరిగెను నిమరింప నంతిపురముకు
మరునటియుదయమ్మె మానవేంద్రునకు
గురునుపదేశమ్ము కూడఁగానుంట
అరుణోదయమునందఁ హర్షతలేచి
కరణీయములనెల్ల గ్రిక్కునఁదీర్చి
పెద్దలతోఁగూడి పేరోలగమున
గద్దెనెక్కి వెలింగె తన్మాతలేంద్రుండు
నొకఁడుఁధరించిన యొడలెదుస్తులకు
నెకదాకిమండిన చిత్తసంక్షోభ
మంది జలమ్మునకై యారాటమిటుల
ఘొందునో యారీతి భూపాలమణియు
మోక్షార్థియై గురుపుంగవుకొఱకు
వీక్షించుచుండె తా విపరీతవాంఛ
గురువునకై కొంత కుందుచుసతము
హరహరయనిమూర్ఛ నందుచునుండు
ద్వారికులతోడఁ ధాత్రీశ్వరుండు
యీవిధమ్ముగనాజ్ఞ నిచ్చియునుండె
"దిసమొలవాఁడైన తిక్కవాఁడైన

పసిబాలకుండైన పైత్యరోగమున
శ్రమజెందువాడైన చండాలుడైన
మముజూడజనుదెంచు మనుజుల నెల్ల
పనుపుడిలోనికి వారింపజనదు''
ప్రభువాజ్ఞనుండిరి ద్వారపాలకులు
సభలోన నారాజు చక్కగూర్చుండె
కొలువుకూటమునందు కూర్చున్నవారు
పలుకకయుండిరి భాషించుటుడిగి
ఆవిభుడుపదేశమగు తరియయ్యె
యీవిధంబెరుగక హృదిగుందునతడు
పరమేశ్వరుండంత భక్తునిదరికి
శిరమున పేలికల్ చేరిచిచుట్టి
పిచ్చివాడనియెంచి ప్రేక్షకుల్ నవ్వ
వచ్చుచాలని గోచిపాతనుదాల్చి
వికృతిరూపముతోడ వేయరుదెంచు
నకలంకుజగదీశు నాదరబుద్ధి
నెదురేగిగొని తేర నిచ్చజనింప
ముదమునసనమును వీడినిలువ
మాయవేషముగొన్న మన్మథాంతకుడు
ఆయెడ దక్షిణహస్తమ్మునెత్తి
నిలబడుమనియేగె నిమిషమాత్రమున
పలుకకమాయమై ప్రజజూచుచుండ
శ్రీకంఠువాక్యముల్ చెవిబడినంత
భూకాంతుడీరీతిబుద్ధిలో దలచె

# జీవ బ్రహ్మైక్యసార మంజరీ ద్విపద.

భూవిభువిడనాడి పొలుపారననుచు
సవిధమ్ముగవార లెట్టకేలకును
చింతించిరూఢిని చేసిరంతటను
"ఎంతకాలంబైన నిట్టులవేచి
యుండినచోరాజ్య మూడునుగాన
బెండునువడకుండ బీరమ్ముతోడ
పతిశిఖాయంగుళి బడసియుమనము
ధృతిభూతములనేల తెల్వియారాజమ్ము"
జరిపిరాతీరున సచివోత్తములును
వరుసగా పండ్రెండు వర్షములదనుక
ఆ నృపాలవరేణ్యు డానాటికేని
కానడు కనువిచ్చి ఘనయోగమహిమ
ముందుచెప్పెదునట్టి ముఖ్యసంగతుల
సందర్భంబుగామీర లరసెదరేని
బాగుగా (శ్రీ) జీవ బ్రహ్మైక్యరాజ
యోగసారమునందు నుండుగన్గొనుడి.



# జనకమహారాజు రాజ్యపరిపాలనము.



జలజపత్రస్థమౌ జలబిందువెటుల
నిలుచునంటకయట్లు నృపతిజనకుడు
మనమునునిల్పియు మహినేలినటుల
జనసంఘమెల్ల నాశాపాశమునను
కట్టువడకయుండి కార్యజాలమ్ము
దిట్టమైయొనరించు తీరునీక్రింగ
పలుకబోయెడిదాని పాటించిమీరు
మెలగినజ్ఞానులై మేలునందెదరు
జనకమహారాజు సత్సభాస్థలిని
ఘనమైనవరత్న ఖచితసింహాస
నముననాసీనుడై న్యాయమార్గమున
శ్రీమనాకపాలించు సమయమ్ములంద
తానొనర్చెడిపనుల్ తప్పకుండుటకు
పూనిజాగ్రదవస్థ బుద్ధిజొన్పియును
పనులెల్లముగియించి భవనమ్మునకును
జనువేళఘనయోగి జనకభూవరుడు
తనబుద్ధికితరంబు తలపురానీక
జనుచున్న నిలుచున్న శయనించియున్న
ఆకాశరూపమౌ నాత్మయందునను
భూకాంతుడైక్యమ్ము పొందించిబుద్ధి
అనిశమ్మునుసమాధి యందుననిలచి

## జీవ బ్రహ్మైక్యసార మంజరీ ద్విపద.

మొనసిబ్రహ్మానంద మునచొక్కుచుండు
జనకునిమదిలోన సంకల్పమెపుడు
జనియించువ్యవహార సరణినిగూర్చి
అపుడాసమాధియు నౌనకృత్యంబు
నృపుడంతరాజ్యమ్ము నిష్ఠమైనేలు
మరలకొల్వునమాని మరలిగేహమున
కరుదెంచిబ్రహ్మమం దైక్యమ్మునందు
మనసుమాయముజేయు మర్మజ్ఞుడైన
జనకుండునమనస్క సరణినిత్యంబు
అవికారుడై నిల్వ నౌగాక తనకు
తవిలెరాజ్యాపేక్ష దగునెచరింప?
అనికొందఱకు సంశయముగల్గనొప్పు
నని మెంచికారణ మందులకెదియొ
నిచట్లనే తెలియుంగ సీగ్రంధకర్త
రచియించెమాడుడీ శ్రద్ధతోడుతను
జనకభూపతి పూర్వజన్మమ్ములందు
నానరించుచువచ్చి యుండినయట్టి
నిజకర్మశేషమ్ము నిలచియుండుటను
ప్రజలపాలించెడి ప్రభువై జనించె
యింగువపిడతలో నించుకయంత
యింగువలేకయే యెట్టిరీతిగను
వాసించియును నగ్ని వైచినవెంట
బాసిపోయియునందు పరిమళమెల్ల
పిడతయునూత్నమౌ విధముగాదొప్ప

## జనకమహారాజు రాజ్యపరిపాలనము.

బడియేటురీతిగా ప్రాణులయొక్క
సంచితమాకర్మ సంక్షీణమయ్యు
నించుకశేషించు నింగువపిడత
నొకయింతవాసన ముండకయున్న
ప్రకటితంబగుచుండు పరిమళమట్లు
తనకర్మశేషత తనువునుదాల్చు
తనువుదాల్చినమీద తాఁమాయఁబడక
తెలివినివిడనాడి దేహవాసనను
కలకర్మశేషమ్ము కాలిచివైచి
పొందజాలునుగాని మోక్షపదమ్ము
ముందుగపొందడు ముక్తినెవ్వండు
అలమోక్షపదమున కర్థమేమనిన
కలబంధములదుల్చి కడనునిల్చుటయె
అణుమాత్రమగువాశ యందుజిక్కినను
కనలేరుముక్తి నిక్కమ్ముగానెవరు
కానశేషించియు కర్మనిల్చినను
మానసమమనస్క మార్గమ్మునందు
నిరతమ్మునిలువదు నిశ్శేషముగను
దొరకొన్నతనకర్మ తూలెడిదనుక
జనకభూపతియిట్లు జరిపిజీవితము
మునుకర్మశేషమ్ము ముగిసినపిదప
తివిరిసుజ్ఞానమ్ము తెలిసిసాధించి
భవబంధమునుబాసి బ్రహ్మమైనిలచె
జనకుండుతనపూర్వ జన్మమ్మునందు

ఘనయోగిమాత్రమై జ్ఞానసంసిద్ధి
గనలేక ప్రారబ్ధ కర్మ శేషింప
జనియించి జగతిలో జనకుఁడన్ పేర
శేషితకర్మమ్ము క్షీణించుదనుక
పోషించె ప్రజనెల్ల భూపాలుఁడగుచు
జనులను పాలించు జనకుఁడొక్కప్పుడు
తనకుతానై నిల్చి దగకొంతసేపు
జనకపృథ్వీశుని చరితంబు నెల్ల
ఘనపండితులనుండి గ్రహియించినంత
తెలియుటకై మీకు తేటమాటలను
పలికితినిందున పఠియింపుడయ్య
పరమాణువాదిగా పరమేష్ఠివరకు
అరయంగ జగము మాయావృతంబగుట
జ్ఞానంబెరుంగక సలజీవులును
మానక పలుమారు మహిని జన్మించి
పెరిగి దేహము వీడి వెడలుచు తుదకు
యెరుకయించుక గల్గ నెల్ల కార్యముల
నమలుడై పరమేశ్వరార్పణమంచు
భ్రమవీడి సల్పిన క్రమముగా మాయ
హరియింప సంచిత మది యంతరించి
పరమార్థవస్తువు బడయంగ జాలి
వరయోగియై కర్మబంధమ్ము వీడి
నిరుపమ బ్రహ్మమై నిల్చును కడకు
స్త్రీపురుషాదులు జీవితమందు

నాపుత్రపౌత్రులు నాభార్యయనుచు
మోహసాగరమందు మున్గితేలుచును
దేహమ్మెతామని తెలియకతలచి
తనువువారంగెడి తరుణమ్మునందు
మనమునచింతింప మహినితామరల
మోహబీజమనెడు మొలకయెత్తగను
దేహియామోహమ్ము దీర్చుకొనంగ
తనకర్మశేషమ్ము దగ్ధమౌగనుక
జనదుమోహమువీడి జనులనెవ్వరిని
పరమేశతుల్యుడై భాసిల్లుచున్న
పురుషుండుతనకర్మ పోనాడకున్న
పొడముచు పెరుగుచు పొలియుచునుండు
పుడమినినిజకర్మ బూదియౌగనుక
సోదరీమణులార సోదరులార
మోదఖేదమ్ముల మునిగితేలకుడి
తామరాకుననీరు తగులకయుండ
నేమాడ్కినిల్చునో యెరిగిమీరలును
సల్పుచునుండియు సర్వకార్యముల
నిల్పగావలెబుద్ధి నిస్సంగముగను
ఆశలక్రమమున హరియింపజేసి
లేశమ్ముమోహమ్ము లేకమెలంగ
నవివేకకృతకర్మ నంతరించుటను
భవబంధమునువీడి బ్రహ్మమైవెలుగు
కనుక తా మత్యాశ కలగుండువడక

కనువారలకుమాత్రి కన్పించుచటుల
ఆశవీడెద రేని అంతరంగమున
పాశబంధమువీడి బడయనౌముక్తి
తక్కినవిషయముల్ తగ నెఱుంగుటకు
మిక్కిలిశ్రద్ధతో మీరుపఠింప
బాగుగా శ్రీజీవబ్రహ్మైక్యరాజ
యోగమ్మునందున నుండుగ్రంథనుడి.



# పరమశివుఁడు తెల్లని శరీరమునుధరించి చూపిన రహస్యార్థము.



పురుషపుంగవులార భుజగభూషణుడు
ధరియించిచరియించు ధవళదేహమును
శ్వేతకాంతులపైకి చిమ్ముచునట్టి
భూతిరేఖలుమూడు ముఖమునదాల్చు
దీనిరహస్యమ్ము దెల్పభక్తులకు
తానిట్టిరూపమ్ము తాల్చెనుశివుడు
యిట్టియవతారమ్ము నెత్తసీశ్వరుడు
యెట్టిహేతువొదాని నిందుజెప్పెదము
మదిలోన మాయయు మర్మంబులేక
సదమలవృత్తితో సర్వకాలముల

మెట్టితలంపుల హృదయమ్మునందు
పట్టగాసీయక స్ఫటికంపుఖాతి
నిర్మలమౌబుద్ధి నిల్వనౌన నెడి
ధర్మంబుబోధింప ధవళదేహమ్మ
పరమేశ్వరుడుదాల్చి ప్రజలకందరకు
ధరపైన తరుణిపై ధనములపైన
మూడింటనాశల బొందకుడనుచు
మూడు రేకలబూది మొగమునదాల్చి
పేరిమితో దెల్పు విశ్వేశ్వరుండు
ఘోరహస్యార్థమ్ము నెఱిగిమీరెల్ల
ఆరామగేహాదు లందున నాశ
దారాసుతాళిపై తరుగనియాశ
కనకంబుపైనను కడలేనియాశ
అనుమూడురీతుల యాశలనుడుగ
ఘనమా నహంకార కామ్యమ్ముమాయ
లనుమూడుమలములు హరియించియతడు
చరియించునేనియు జ్ఞానయోగమున
పరిశుద్ధుడైతానె బ్రహ్మమైవెలుగు
యీతీరు తెల్పుట కీశుండునుదుట
భూతి రేఖలుదాల్చు పోడిమినెరిగి
ఆశాత్రయంబుల నణచెడివారు
యీశునికరుణ నార్జించిజ్ఞానమ్ము
వాయంగకర్మముల్ భవబంధముడిగి
ఆయీశ్వరునియంద నైక్యమయ్యెదరు

కపటిరై బూదిని కాయమందలమి
జపతపమ్ములొనర్ప సఫలమ్ముకాదు
భూతి రేఖలుమూడు ముఖమునందునను
ప్రీతమ్మునకుగూడ పెట్టుటయెల్ల
ఱెఱిగినవిషయంబ యేమిదియనిన
ధరణిలో మరలను తాపుట్టినపుడు
ఆశాత్రియము గెల్చి అజ్ఞానముడిగి
కౌశలమ్మునము క్తి గాంచుమీ యనెడి
అనుపమసర్వార్థ నాశవమ్మునకు
నొనరించుభావమా నూహించిచూడ
నిర్మలబుద్ధితో నే దెల్పినట్టి
ధర్మమ్ముల నెఱింగి తగినట్లుమెలగి
కర్మబంధములెల్ల ఖండించివైచి
మర్మజ్ఞులై జ్ఞానమార్గమ్ముగనుడి
పరమభ క్తినిదీని పఠియించువారు
సిరియుసంపదగల్గి చెలువొందునట్టు
లేకాంబరేశుడే యెల్లవేళలను
ప్రాకటమ్ముగుప్రేమ రక్షించుగాత!

ఓమ్ తత్సత్.

శ్రీ జీవ బ్రహ్మైక్య రాజయోగసార మంజరీ ద్విపద
సంపూర్ణము.



# శ్రీ పరమహంస సచ్చిదానంద యోగీశ్వరులవారి అద్భుతమహిమను,

14 th మిలటరీ నక్కమిషక్ ఆఫీసరు

దాస శ్రీ కృష్ణస్వామి నాయనివారి తృతీయపుత్రుఁడగు,

ాగవత శిఖామణియగు-దుర్గాచల దాసు బొగడుచున్నారు.



రాగం కనడా - తాళం ఆది.

ప॥ సద్గురు సచ్చిదా నందయోగులవారి

అ॥ చరణకమలముల సేవించేడి ♦ గురు;

సాధుజనావళి రాయా♦గురూజన♦సాధుజనావళి

రాయా॥ సద్గురు॥

చరణములు.

ఆనందధీర పరాత్పర ఆర్యా

అచలభావ సంపూర్ణ విధేయా;

సాధు జనావళి రాయా ♦ గురూజన సాధుజనావళి

రాయా॥ సద్గుర

సాధుబృంధ సౌభాగ్యసుశీలా

సాధు జీవ దయాపరరాయా;

సాధుజనావళి రాయా ♦ గురూజన సాధుజనావళి

రాయా॥

ఘన బండెనిమిందు వత్సరముల సాధన
మనమున మానస పూజ యొనర్చిన;
సాధుజనావళి ♦ రాయా గురూజన సాధుజనావళి
రాయా॥ సద్గురు॥

పారమార్థికాధారము చేకొని
పతితులనేలెడు పావనరాయా;
సాధుజనావళి రాయా ♦ గురూజన సాధుజనావళి
రాయా॥ సద్గురు॥

కడప గడికోటను కరుణతో నెలకొని
బుడమిని యోగసమాధిలో నిండిన;
సాధుజనావళి రాయా ♦ గురూజన ♦ సాధుజనావళి
రాయా॥ సద్గురు॥

దివ్యదేశ సంచారము చేకొని
దీనులేలిన దివ్య సుజ్ఞానీ;
సాధుజనావళి రాయా ♦ గురూజన ♦ సాధుజనావళి
రాయా॥ సద్గురు॥

అభయమన్న వారల చేవిడువక
యఘములుబాపి యోగంబున నిల్పిన;
సాధుజనావళి రాయా ♦ గురూజన ♦ సాధుజనావళి
రాయా॥ సద్గురు॥

ఆనందనిలయా అద్భుతరాయా
ఆంధ్రదేశ యోగామృత మొసగిన;
సాధుజనావళి రాయా ♦ గురూజన ♦ సాధుజనావళి
రాయా॥ సద్గురు॥

